LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM    Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 50    15.12.2000 శుక్రవారం    12 పేజీలు    విడిప్రతి : రూ.2.00లు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# విచారణకు భయమెందుకు?

బ్రాంది, విస్కీల కొనుగోలులో రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న పెద ధోరణి పలు విమర్శలకు దారి తీస్తున్నది. అధికారులు, మంత్రులు కల్సి కొన్ని వందల కోట్ల రూపాయలు గుట్టు చప్పుడు కాకుండా నంజుక తింటున్నారు.

రాష్ట్రంలో మద్యం హోల్‌సేల్ వ్యాపారాన్ని జాతీయం చేసింది ప్రభుత్వం. దీని వల్ల మద్యం ధరలలో వచ్చే అధిక లాభం ప్రభుత్వ ఖజానాకు చేరుతుంది అన్నదీ వుద్దేశ్యం. ఈ పద్ధతి ప్రకారం ప్రభుత్వం బేవరేజి కార్పొరేషన్ ద్వారా బ్రాంది, విస్కీలు కొనుగోలు చేస్తుంది. ఒక్కొక్క కంపెనీతో మాట్లాడి, ధరలు నిర్ణయించడానికి ఐదుగురు ఐఎఎస్ అధికారులతో ఒక కమిటీ ఏర్పాటు చేశారు. మన ఐఎఎస్ అధికారులను, అధికారంలో వుండే వారికి గులాములుగా మార్చుకోవడం పెద్ద పని కాదు. కొంచెం తలదించి రమ్మని చెప్తే, దేగాడుతూ వచ్చి, విధేయత ప్రకటించే వెన్నెముక లేని జీవాలు ఐఎఎస్ అధికార ప్రపంచంలో చాలానే వున్నాయి. ఈ కమిటీని అడ్డం పెట్టుకుని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నిశ్శబ్దంగా ఏటా కొన్ని వందల కోట్లు తన జేబులో

**బ్రాందీ, విస్కీలల్లో వందలాది కోట్ల రూపాయల ప్రజాధనం దుబారా అయిపోయింది; దీనికి కారకులు కేవలం అధికారులేనా లేక ముఖ్యమంత్రి కూడా పాపం పంచుకున్నాడా అన్నది తేల్చడం చాలా అవసరం.**

వేసుకుంటున్నాడు. ఇంత కాలం ఈ దోపిడి రహస్యంగా సాగింది; ఎందువల్లో ఇప్పుడది బైట పడిపోయింది. పత్రికలలో వార్తలు రావడమే కాదు, సిఎల్పి నేత డాక్టర్ వై.ఎస్.రాజశేఖరరెడ్డి ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి మరీ ఈ ఆరోపణ చేశారు. ఇందులోని నిజానిజాలు నిర్ధారణకు ఒక దర్యాప్తు సంఘం నియమించమని కోరారు.

మెక్‌డోవెల్ బ్రాంది, విస్కీల విషయంలో ఈ అవినీతి ఎక్కువగా జరుగుతున్నట్లు బయటపడింది. తమిళనాడులో అమ్మే ధరల కంటె దాదాపు ఒకటిన్నర రెట్లు ఎక్కువ ధరకు ఈ కంపెనీ నుంచి మద్యం కొనుగోలు చేస్తున్నది ప్రభుత్వం. ఈ కంపెనీ బ్రాందీ ఒక పెట్టె 327 రూపాయలకు తమిళనాడు ప్రభుత్వం కొనుగోలు

తొరవ 12వ పేజీలో

## ఆంధ్ర నేతలకు అవకాశం వుందా?

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఎన్నికలు వాయిదా పడ్డాయి. డిసెంబరు 22తేది ప్రాంతంలో ఎన్నికలు జరుగుతాయని పత్రికలలో వార్తలు వచ్చాయి. దానితో అందరు హడావుడి పడ్డారు. కాని సోనియాగాంధీ మాత్రం ఎన్నికల తేదిని జనవరి 6తేదిగా నిర్ణయించింది. అది కూడా ఖరారు కాదు; మార్పు జరిగినా ఆశ్చర్యం లేదు.

మన రాష్ట్రం నుంచి ఇప్పటి వరకు నేదురుమల్లి జనార్దనరెడ్డి ఒక్కడే సిడబ్ల్యుసి పోటీకి స్పష్టంగా తన నిర్ణయం ప్రకటించారు. అందరి కంటె పెద్దాయన - విజయభాస్కరరెడ్డి ఇంకా తటపటాయింపులోనే వున్నాడు. సోనియాగాంధీ ప్యానల్ అభ్యర్థులను పెట్టి, అందులో తన పేరు చేరిస్తే పోటీ చేయాలని ఆయన వుద్దేశ్యం. కాని ఆమె ఈ ఎన్నికలలో తన అభ్యర్థులంటూ ఎవరి ముఖాన ముద్ర గుద్దే సూచన కన్పించడం లేదు. ఎవరి తంటాలు వారుపడి, గెల్చుకుని వస్తే ఆ తర్వాత వారందరు తన వారని చెప్పడం ఆమె ఆలోచనగా కన్పిస్తున్నది. ఆమె మద్దతు లేకుండా గెలవడం కష్టం కాబట్టి, అటువంటి పరిస్థితి వస్తే గౌరవంగా పోటీ నుంచి తప్పుకోవడం మంచిదని విజయభాస్కరరెడ్డి చెప్తున్నాడట.

ఆంధ్ర నుంచి పోటీ పెడుతున్న మరొక నేత - తిక్కవరపు సుబ్బరామరెడ్డి. ఆయన దేశంలోని కాంగ్రెస్ నేతలందరిని కల్సి తనకు ఓటు చేయమని ఒక రౌండ్ ప్రచారం కూడా చేసేశారు. ఉత్తరాదిలో చాలా రాష్ట్రాల కాంగ్రెస్ పెద్దలు తనను బలపరుస్తారన్న నమ్మకంతో వున్నాడు

తొరవ 7వ పేజీలో

# మాటలు తప్ప చేతలు లేవు

కేంద్ర వ్యవసాయ మంత్రి ఆంధ్రలో పర్యటించి వెళ్లిన తర్వాత కూడా రైతుల దౌర్భాగ్య పరిస్థితిలో ఎంత మాత్రం మార్పు రాలేదు. మన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ధాన్యం మద్దతు ధరల విషయంలో నింద మాత్రం కేంద్రమంత్రిపైన, ఎఫ్‌సిఐ అధికారులపైన వేసిన విషయం తెల్సిందే. తాను ఎంత మొత్తుకుంటున్నా ఎఫ్‌సిఐ అధికారులు ధాన్యం కొనడం లేదని పలుసార్లు ప్రకటనలు చేశాడు ముఖ్యమంత్రి. పార్లమెంటులో తెలుగుదేశం ఎమ్పీలు ధర్నా చేశారు. ఈ గొడవ తప్పించు కోవడానికి కేంద్ర వ్యవసాయ మంత్రి శాంతకుమార్ ఒక రోజు హైదరాబాద్ వచ్చి వెళ్లారు. కాని ఆయన పర్యటన వల్ల కల్గిన ఫలితం మాత్రం శూన్యం.

శాంతకుమార్ ఎక్కడా రైతులను కలవలేదు. కేవలం అధికారులు, రైసు మిల్లర్లతో మాత్రమే మాట్లాడారు. ఎఫ్‌సిఐ తరఫున ఈ సీజన్లో 10లక్షల టన్నుల బియ్యం కొంటామని మాత్రమే హామీ

**వట్టి మాటలతో రైతుల కష్టాలు తీరవు - ప్రభుత్వమే నేరుగా వడ్లు కొంటే తప్ప పరిస్థితి మారదు!**

ఇచ్చారాయన. ఇదేమి కొత్త విషయం కాదు. ఎఫ్‌సిఐ ఇప్పటికే బియ్యం కొనుగోలు చేస్తున్నది. గత ఏడాదికంటె అధికంగా కూడా బియ్యం కొన్నారు. కాని దాని వల్ల రైతులకు జరిగే మేలు ఏమీ లేదు. రైతుల నుంచి వడ్లు కొనవల్సింది మిల్లర్లు మాత్రమే. వారు రైతుకు మద్దతు ధర కూడా ఇవ్వనందు వల్ల ఇప్పటి సంక్షోభం తలెత్తిన మాట కేంద్ర మంత్రికి తెలుసు; ముఖ్యమంత్రికి కూడా తెలుసు. కాని వీరిద్దరు కల్సి రైతులను, మిల్లర్ల దయాదాక్షిణ్యాలపై వదలివేసి తప్పించుకుంటున్నారు. ఏ ఒక్క మిల్లరు మద్దతు ధర ఇవ్వకుండా తనకు తెల్సినా వారిపై కఠిన చర్య తీసుకుంటానని డాంభికపు ప్రకటనలు చేశాడు ముఖ్యమంత్రి. కాని ఆయన రాష్ట్రంలో ఏ మార్కెటింగ్ యార్డుకు వెళ్లినా రైతులు స్పష్టంగా చెప్పారు, తమకు మద్దతు ధర రావడంలేదని. వచ్చినంత వరకు ధాన్యం అమ్మవద్దని ఒక ఉచిత సలహా ఇచ్చి అక్కడ నుంచి వెళ్లిపోతున్నాడు చంద్రబాబు. ఆయన

తొరవ 7వ పేజీలో

## కేసులెందుకు వెనక్కు తీసుకున్నట్లు!

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు మీద హైకోర్టులో వేసి వుండిన కేసులన్నిటిని ఒకేసారి ఉపసంహరించి సంచలనం సృష్టించాడు డాక్టర్ వై.ఎస్.రాజశేఖరరెడ్డి. మాదాపూర్‌లో భూముల ఆక్రమణ, హెరిటేజ్ ఫూడ్స్ కంపెనీ కుంభకోణాలు, కాంట్రాక్ట్ పనులలో అవినీతి వంటి విషయాలపై చాలా కాలం క్రితం ఈ కేసులు వేశాడు వై.ఎస్. దీనిపై పెద్ద రచ్చ కూడా జరిగింది. అయితే ఇప్పుడు వున్నట్లుండి వాటిని విత్‌డ్రా చేయడంతో అందరు ఆశ్చర్యపోతున్నారు. కారణం తెలియక తలలు బద్దలు కొట్టుకుంటున్నారు. వై.ఎస్. వర్గీయులు చెప్పే కారణం - వీటితో పోలిక కల్గిన మరొక కేసు నేరుగా సుప్రీంకోర్టులో అడ్మిట్ అయ్యింది కాబట్టి రెండు దగ్గరల అనవసరమని ఉపసంహరణ నిర్ణయం తీసుకున్నారట. అంతరంగికంగా తెలుస్తున్న సమాచారం ప్రకారం, మన హైకోర్టులో కొందరు న్యాయమూర్తులకు, ముఖ్యమంత్రికి ఏర్పడుతున్న దగ్గరి

తొరవ 7వ పేజీలో

# సిటీ ఫైనాన్స్‌లో ఘరానాదొంగలు-10 కోట్లు హాంఫట్!

నెల్లూరు, మద్రాసు సిటీఫైనాన్స్ కంపెనీల్లో దొంగలు పడ్డారు. దాదాపు 10కోట్ల రూపాయల ప్రజాధనాన్ని దర్జాగా కొల్లగొట్టేశారు. ఈ దొంగలు స్టూవర్టుపురం నుంచో లేక కప్పరాళ్లతిప్ప నుంచో వచ్చిన వారు కాదు. సిటీఫైనాన్స్‌లో కొందరు పార్టనర్లే దొంగలుగా మారి బినామీపేర్లతో ప్రజల డబ్బును దోచేసి, దాచేసి, దర్జాగా ఎ.సి.కార్లలో, తిరుగుతూ, ఎసి రూముల్లో సేదతీరు తున్నారు. విచారణ పేరుతో వచ్చిన పోలీసులకు పదోపరకో పారేసి తమ పబ్బం గడుపుకుంటున్నారు.

యానికి సిటీ ఫైనాన్స్‌లో చిత్తు కాగితాలు తప్ప పైసా డబ్బు లేకుండా పోయింది. ఈ సంస్థల్లో భాగస్తులుగా వున్న గాదం శెట్టి గోపాల్, బోడా చిదంబరం కూతురు బోడా సుధ, స్టోన్‌హౌస్‌పేటకు చెందిన ఆడిటర్ కె.రాధాకృష్ణయ్య కూతురు కె. జ్యోతిర్మయి, జి. శ్రీరామమూర్తి, పి.జయ రామయ్య, ఎ.లక్ష్మీనారాయణ బినామీ పేర్లతో కోట్లు దోచేశారు. ప్రజలు కట్టిన డిపాజిట్లను నిజాయితీగా, ఇతర వ్యాపారాల్లోనే, సంస్థల్లోనే మదుపుపెట్టి లాభాలు సంపాదించే పనికి తిలోదకాలు

## గాదె క్రింద పందికొక్కు గాదంశెట్టి ఉంపుడుగత్తెలకు ఇళ్లు - కార్లు

ఆరేళ్ల క్రితం నెల్లూరు, మద్రాసులో సిటీ ఫైనాన్స్ పేరుతో స్టోన్‌హౌస్‌పేటకు చెందిన గాదంశెట్టి గోపాల్ మేనేజింగ్ పార్టనర్‌గా నాలుగువేల మంది సభ్యులతో ఫైనాన్స్ కంపెనీ ఏర్పాటయ్యింది. ఒక్కొక్క సభ్యుడి నుంచి 10వేల రూపాయల చొప్పున నాలుగుకోట్లు వసూలు చేశారు. ఐదేళ్ల తర్వాత డిపాజిటర్లకు 20వేల రూపాయలు ఇస్తామని బాండ్లు కూడా ఇచ్చారు. నెల్లూరు, మద్రాసు సిటీఫైనాన్స్ సంస్థల్లో పార్టనర్లంతా నెల్లూరీయులే కావటంతో రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న జిల్లావాసుల చేత డబ్బులు కట్టించారు.

డిపాజిట్ల గడువు ముగిసే సమ ఇచ్చేసి, ఎవరికివారు దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలన్న చందంతో డబ్బులు దోచేసుకొని, ప్రజలకు మొండి చెయ్యి చూపించారు.

సిటీఫైనాన్స్ సంస్థకు మేనేజింగ్ పార్టనర్‌గా ఉన్న గాదంశెట్టి గోపాల్ ఒక్కడే రెండున్నర కోట్ల రూపాయలు స్వాహా చేశాడని రికార్డుల్లో స్పష్టంగా కనిపిస్తోంది. సిటీఫైనాన్స్‌లో ప్రజల డబ్బుతోనే ఈ మోసగాడు బెంగుళూరులో సిటీఫామ్స్ పేరుతో ఒక సంస్థను స్థాపించి, కోట్ల రూపాయలకుపైగా అక్కడ ప్రజలకు టోపీ వేసి తప్పించుకు తిరుగుతున్నాడు. సిటీఫైనాన్స్‌ను అడ్డం పెట్టుకొని నెల్లూరు బ్రాంచి నుంచి 40లక్షలు మద్రాసు బ్రాంచి నుంచి 80 లక్షలకు పైగా బినామీ పేర్లతో రుణాలు తీసుకున్నాడు. ఆ మొత్తం వడ్డీతో కలిపితే, ప్రస్తుతం రెండు కోట్లకు చేరుకుంది. తన వద్ద గుమస్తాలుగా పనిచేసే వెనమ సురేష్ పేరుతో గాదంశెట్టి గోపాల్ 26 లక్షల రూపాయలు బినామి రుణం తీసుకున్నాడు. పి.జనార్ధన్, జయశంకర్ అనే మరో ఇద్దరు గుమస్తాల పేరుతో 17లక్షల 70వేల రూపాయలు, ఆదిలక్ష్మి అనే మరో గుమస్తా పేరుతో 7లక్షల 20వేల రూపాయలు రుణం తీసుకున్నాడు. ఇది కాకుండా తనకు గుర్తొచ్చిన పేర్లతో మరో 30లక్షలు డ్రా చేసి, దాచేశాడు. కట్టుబట్టలతో బ్రతుకు తెరువు కోసం నెల్లూరుకొచ్చిన గాదంశెట్టి గోపాల్, సిటీఫైనాన్స్ పుణ్యామా అంటూ, ప్రజల డబ్బుతో కోట్లకు పడగలెత్తాడు. బంధుమిత్రుల పేరుతో రాజసౌధాలను తలదన్నే భవంతులను నిర్మించాడు. తన ఉంపుడు గత్తెలకు కారు, భవనాలు సమకూర్చిన ఘనుడు. తెలుగుదేశం నాయకురాలుగా చలామణిలో ఉన్న ఆ ఉంపుడుగత్తె గాదంశెట్టిని కాపాడేందుకు సర్వస్వం ధారపోసి వృధా ప్రయత్నాలు చేస్తోంది. ఉంచుకున్నవాళ్ల భర్తలకు కూడా రుణం పేరుతో ప్రజాధనాన్ని దోచిపెట్టిన దానకర్ణుడు. సిటీఫైనాన్స్‌లో రుణం తీసుకున్న వ్యక్తులు, దానిని తిరిగి చెల్లింపు చేస్తే ఆ డబ్బును కూడా తన వ్యక్తిగత ఖాతాలోకి జమచేసుకున్న మహా మాయగాడు. ఈ మోసగాడి పాపం పండి మద్రాసులో ఆర్థిక నేరాలను పర్యవేక్షించే పోలీసుల చేతికి చిక్కినట్టే చిక్కి జారిపోయాడు. సిటీఫైనాన్స్ గాదెకింద పందికొక్కులా మారిన గాదం శెట్టి కోసం మద్రాసు పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారు.

సిటీఫైనాన్స్‌లో ప్రజల డబ్బును గోల్డ్‌స్పాట్ మాదిరి మజాగా ఆ స్వాదించిన మరో పెద్ద మోసగాడు బోడా చిదంబరం. ఆయన కూతురు బోడా సుధ సిటీఫైనాన్స్ మద్రాసు శాఖలో పార్టనర్. తెలివైన వ్యాపారస్తుడు కాబట్టి సిటీ ఫైనాన్స్ నుంచి ముందుగానే 43లక్షల రూపాయల రుణం తీసుకొన్నాడు. అది ఇప్పుడు రెండు కోట్ల 11లక్షల రూపాయలైంది. మొన్న మధ్య చిదంబరాన్ని మద్రాసు పోలీసులు పట్టుకెళ్లి మూడు రోజులపాటు నిర్బంధించి తమ స్టయిల్‌లో రాచమర్యాదలు చేయడంతో 10 లక్షల రూపాయలు డబ్బులు కట్టేశాడు. పి.జయరామ్ అనే మరో పార్టనర్ బినామీ పేర్లతో 54లక్షల రూపాయలు దోచేశాడు. ఇందులో 27లక్షల రూపాయలు ఈ మహానుభావుడు స్వంతంగా తన కొడుకు పేరు మీద తీసుకొని స్వాహా చేసేశాడు. జి.శ్రీరామమూర్తి అనే మరో పార్టనర్ 11లక్షల రూపాయలు రుణం పేరుతో ఇంటికి తరలించాడు. స్టోన్‌హౌస్‌పేటలోని ఆడిటర్ కె. రాధాకృష్ణయ్య తన కూతురు పార్టనర్ అయిన జ్యోతిర్మయని అడ్డంపెట్టుకొని 65లక్షల రూపాయలు దోచేశాడు. ఇందులో 48లక్షల రూపాయలు ఆయన స్వంతంగానే రుణంగా తీసుకొని, పైసాకట్టకుండా ఎగవేశాడు.

కట్టిన మొత్తాలకు రెట్టింపు మొత్తం ఇస్తామని పేద, మధ్యతరగతి ప్రజలను మభ్యపెట్టి కట్టించుకున్న కోట్ల రూపాయల డబ్బును పందులు పెంటతిన్నంత ఆత్రంగా స్వాహా చేసిన ఈ మోసగాళ్లను ప్రజలు చెప్పులతో కొట్టి ఉరితీసినా పాపం లేదు. చట్టాన్ని, చట్టంలోని లొసుగులను అడ్డం పెట్టుకొని తప్పించుకు తిరుగుతున్న ఈ మోసగాళ్లకు ఇస్లాం న్యాయసూత్రాల ప్రకారం శిక్షలు విధించడమే సమంజసం. డిపాజిటర్లకు 20 వేల రూపాయలు ఇవ్వాల్సి ఉన్నా, నోరుండి తన్నబోయే వారికి మాత్రం 8 నుంచి 10వేల రూపాయలు ఇచ్చి ఇంత కాలం తప్పించుకుంటూ వచ్చిన గాదంశెట్టి, పాపం అరవ పోలీసుల దెబ్బకు పరారీలో ఉన్నాడు. గంజాయి వనంలో తులసి మొక్కల మాదిరి, ఇంత మంది దొంగ భాగస్తుల మధ్య, ఆ సంస్థలో భాగస్తులయినందుకు వై.టి.నాయుడు, పత్తి రవీంద్రబాబు, కనకమహల్ అజిత్‌బాబు, కె.శ్రీనివాసులురెడ్డి ఫలితం అనుభవించాల్సి వస్తోంది. సంస్థ నిధుల్లో ఒక్క పైసా కూడా స్వంతానికి వాడకోకుండా జాగ్రత్త పడ్డా, దొంగలతో దోస్తీ చేసినందుకు మనస్తాపం తప్పలేదు.

తొరవ 11వ పేజీలో

# నిజంగానే అనాగరికం!

దేశాన్ని పరిపాలించే వారు ఆటవికుల వలె కన్పిస్తున్నారని వ్యాఖ్యానించారు - సిపిఎం నేత జ్యోతిబసు. మమ్మల్ని అంత మాట అనడం అన్యాయమని అరచి, ఆగం చేశారు. బిజెపి నాయకులందరూ! అయితే జ్యోతిబసు వర్ణన ఎంత సహేతుకమో తమకు తాముగా రుజువు చేసుకొంటున్నారు వారిప్పుడు.

బాబ్రీ మసీదు విధ్వంసం ఆధునిక భారత చరిత్రలో ఒక మాయని మచ్చ; అందరూ ఏకీభవించవలసిన వాస్తవం ఇది. చివరకు, ఆనాడు అయోధ్య వరకు రథయాత్ర నడిపి, కరసేవకులను లక్షల సంఖ్యలో తరలించిన ఎల్‌కె అద్వానీ సైతం తను చేసింది తప్పేనని అంగీకరించాడు. పశ్చాత్తాపం వ్యక్తం చేశాడు. మత సామరస్యం అనే నూలు దారంతో నేసిన భారతీయ సంస్కృతి వస్త్రాన్ని చీలికలు, పేలికలుగా చింపి, పోగులు పెట్టిన ఆ దురదృష్టకర దుర్ఘటనను మర్చిపోవడానికి దేశ ప్రజానీకం ప్రయత్నిస్తున్న తరుణంలో, తిరిగి లేవనెత్తాడు ప్రధాని వాజ్‌పాయి. సమయం, సందర్భం లేకుండా ఆ విషయం ప్రస్తావించి, అయోధ్యలో రామాలయం నిర్మాణం జాతి మనోభీష్టం అని ప్రకటించారాయన.

మత ఛాందసవాదుల ముఠా వంటి భారతీయ జనతాపార్టీలో వాజ్‌పాయి ఒక్కడే విశాల హృదయం కల్గినవాడని; కాకుల గుంపు మధ్య కోయిల వంటివాడని ఇప్పటి వరకు భావిస్తుండిన ప్రజలను ఈ ప్రకటన విస్మయపరిచింది. మతస హనం అనే మేలి ముసుగు కప్పు కొని, జనాన్ని మాయచేశాడే తప్ప; ఆయన మనసు సైతం మత మూఢత్వంతో మలినమైనదనే నిజం రుజువు కావడాన్ని జీర్ణించుకోలేక పోతున్నారు ప్రజలు. ఉదాత్త వ్యక్తిత్వం కల్గిన నాయకుడిగా ఆయనపై వుండిన సదభిప్రాయం ఈ ఒక్క ప్రకటనతో తుడిచి పెట్టుకపోయింది.

అయోధ్యలో ఆలయం కడితేనే రాముడి మీద భక్తి ఉన్నట్టు భావించే మూర్ఖత్వం, మూఢత్వం భారతీయ ప్రజానీకంలో లేదు. ఆ ఛాంధసులుండేది ఒక్క బిజెపి పార్టీలో మాత్రమే. దేముడు వుండేది గుడులు, గోపురాలలో కాదు; జనం గుండెలలోనే నిజమైన దేవాలయాలుంటాయి. తమ మతానికి, తాము ఆరాధించే దేవతా మూర్తులకు అపచారం జరగకూడదని మాత్రమే - సామాన్య ప్రజానీకం కోరుకుంటుందే తప్ప, తమ ఆధ్యాత్మిక చింతన కోసం పరమతస్తుల మనసులకు క్లేశం కల్గించాలనే సంకుటిత్వం నగటు భారతీయుడిలో ఎప్పుడూ లేదు; ఇక ముందూ కలగదు. కొన్నివేల సంవత్సరాల భారతీయ సాంస్కృతిక చరిత్ర అందుకు సజీవ సాక్ష్యం. గ్రామ గ్రామాన రామాలయాలున్నాయి మన దేశంలో! అయోధ్య రాముడి జన్మస్థానం అన్నది హిందువుల విశ్వాసం అనడంలో సందేహం లేదుకాని, బాబ్రీ మసీదు వుండిన ఎకరం నేలలోనే రాముడు పుట్టాడు అనడానికి ఆధారాలు లేవు. అయోధ్య నగరం సమస్తం; ఆ మాటకొస్తే యావత్ భారత దేశం శ్రీరామజన్మస్థానమే! రాముడి పుట్టిన చోటును పవిత్రంగా పూజించదలచుకొంటే అయోధ్య నగరంలో ఎక్కడైనా రామాలయం కట్టుకోవచ్చు; మసీదుకూలిన స్థలంలోనే, ఆ పునాదుల మీదనే దేవాలయం నిర్మాణం కావాలని భరతజాతి వాంఛించడం లేదు; ఆ దుర్బుద్ధి, దురాలోచన వుండేది కేవలం బిజెపి నేతలలో మాత్రమే. వారి లక్ష్యం సైతం రాముడిపై భక్తి కాదు; రాముడి పేరుతో మత విశ్వాసాలు ప్రేరేపించి ఓట్లు రాబట్టు కోవడం! కేవలం రాజకీయ ప్రయోజనాల కోసం సమాజాన్ని మతం పేరుతో చీల్చాలని చూస్తున్నది బిజెపి. వాజ్‌పాయి వ్యక్తిగతంగా అందుకు మినహాయింపు అనే అభిప్రాయం ఇంత కాలం వుండింది; ఈ ప్రకటనతో అది తుడిచి పెట్టుకపోయింది.

అయోధ్యలో రామాలయం కట్టాలా, మసీదు పునర్నిర్మించాలా అని నిర్ణయించవలసింది సుప్రీం కోర్టు. ఆ తీర్పు వెలువడే వరకు ఓపిక పట్టడం, ఆ తర్వాత తీర్పును యధాతథంగా అమలు చేయడం కేంద్ర ప్రభుత్వ బాధ్యత. ప్రభుత్వాధినేతగా వుండి కోర్టులో విచారణ జరుగుతున్న కేసుపై పబ్లిక్‌గా అభిప్రాయాలు వ్యక్తం చేయడం నేరం! కోర్టు తీర్పును ప్రభావితం చేయడానికి జరిగిన కుట్రగా కూడా దాన్ని భావించవచ్చు. వాజ్‌పాయి వంటి సీనియర్ రాజకీయవాది అంత చవకబారుతనంగా ప్రవర్తించడం విచారకరం!

ఉత్తర ప్రదేశ్‌లో అతి త్వరలో అసెంబ్లీ ఎన్నికలు జరగబోతున్నాయి. అక్కడ గెలుపు బిజెపికి చాలా అవసరం. తమ నేతలు పార్లమెంట్ ఎన్నికల సందర్భంగా చెప్పిన మాటలు, చేసిన వాగ్దానాలు ఢిల్లీలో గద్దె ఎక్కగానే మర్చిపోయారనే అసంతృప్తి బిజెపి కార్యకర్తలలో వుంది; వారిని బుజ్జగించడానికి, ఓటర్లలో మరొకసారి మతావేశం ప్రేరేపించడానికి వాజ్‌పాయి తెలివిగా, దూరదృష్టితో చేసిన ప్రకటన ఇది. ఇందులో వున్నది కేవలం రాజకీయ దురాలోచనే తప్ప, రామభక్తి కాదు. తమ పదవుల

జమీన్‌రైతు

కోసం ప్రజల మధ్య చిచ్చు పెట్ట చూసే వారిని ఆటవికులు అనడంలో తప్పు ఎంత మాత్రం లేదు. సభ్యత, సంస్కారం తెలి యని అనాగరికులు వీరు. ఇటు వంటి దుష్ట ఆలోచనలు చేసే వారి పట్ల యావత్ ప్రజానీకం మెలుకువతో వ్యవహరించడం దేశ క్షేమానికి ఎంతో అవసరం.

స్వంతంగా ప్రభుత్వం నడిపే సంఖ్యాబలం లేక, మిత్రపక్షాల వత్తిడిని తిరస్కరించలేని బలహీనతలో బిజెపి పాలకులు ఇటు వంటి ప్రకటనలకు పరిమితం అవుతున్నారు కాని; అదే వారి పార్టీకి పార్లమెంట్‌లో పూర్తి మెజారిటీ లభిస్తే మాత్రం వీరు మాటలతో సరిపెట్టుకోరన్నది నిజం. ఇటువంటి ఆటవిక మనస్తత్వం కల్గిన అనాగరికజాతిని రాజకీయల నుంచి వెలివేయడం సమంజసం.

తెలుగుదేశం, తృణమూల్ కాంగ్రెస్, డిఎంకె వంటి మిత్ర పక్షాలు ఒక ప్రక్క బిజెపి ప్రభుత్వాన్నిమోయడం, ఇంకొక ప్రక్క వారు సృష్టించే వివాదాలతో తమకు సంబంధం లేనట్టు నటించడం చేస్తున్నాయి. కేంద్రంలో తమకు అధికారమూ వుండాలి; మైనారిటీలలో సదభిప్రాయమూ ఏర్పడాలి అన్నది వీరి ఆలోచన. అవ్వా, బువ్వా రెండూ కావాలంటే కుదరదు. బిజెపితో తమ వైఖరిని ప్రజలకు స్పష్టంగా తెలియజెప్పడం వీరి బాధ్యత. కేంద్రంలో రాజకీయ అస్థిరత్వం దేశానికి క్షేమకరం కాదు కాబట్టి; ఇప్పుడు మరొక ఎన్నికను భరించే స్థోమత మనకు లేదు కాబట్టి మిత్రపక్షాలు వాజ్‌పాయి ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ఎవరూ కోరరు; కాని ఆ చనువుతో బిజెపి నేతలు ఎంత ఛాందసత్వాన్ని ప్రేరేపించేందుకు చేసే ప్రయత్నాన్ని నిరోధించవలసిన బాధ్యత మాత్రం వీరిపైనే వుందనడం నిజం. ఆ విషయంలో రాజీపడితే ఆయా పార్టీలే కాదు - మొత్తం సమాజమే నష్టపోతుంది. వాజ్‌పాయి చేత వివరణ ఇప్పించడం, సుప్రీంకోర్టు తీర్పును శిరసావహిస్తామని పార్లమెంట్‌కు హామీ ఇప్పించడంలో తెలుగు దేశం నేత చంద్రబాబు నాయుడు పట్టుదల సమర్థనీయం. తతిమా మిత్ర పార్టీలూ ఇదే విధమైన ధోరణి అవలంబిస్తే తప్ప బిజెపి నేతలు మాటవినరు. *

---

జమీన్‌రైతు

15-12-1950

పేజీలు:12 వెల: 0-3-0

## సర్దార్ అస్తమయం

భారత ఉపప్రధాని సర్దార్ పటేల్ 15తేది ఉదయం 9.37 గంటలకు బొంబాయిలోని బిర్లా మందిరంలో దివంగతులయ్యారు.

మూడు వారాలుగా అనారోగ్యంతో బాధపడుతూ, డాక్టర్ల సలహాతో, గాలి మార్పు కోసం బొంబాయికి 12 తేది పోయారు. ఆరోగ్యం ఢిల్లీకంటే బాగున్నట్లు వార్తలొస్తున్నవి. ఇంతలోగా 13 తేదీ రాత్రి పొత్తికడుపు బాధతో నిద్రపట్టలేదట. 15తేది వేకువన మూడు గంట లకు హృదయకోశం ప్రకోపించి స్పృహ తప్పిందట. అప్పుడే డాక్టర్లు నిరుత్సాహ పడి, ఆయన స్థితి ప్రమాదకరంగా వున్నదని ప్రధాని నెహ్రూకు, రాజేంద్ర ప్రసాద్‌కు తెలియజేశారట. ప్రాణవాయువు యిచ్చినా వుపయోగం లేక ఉదయం 9.37 గంటలకు మరణించారు.

## అమెరికాకు అట్లీ తమ్ముడై పోతున్నాడు

బ్రిటిష్ ప్రధాని అట్లీ - ఆసన్న అశాంతి ముఖంతో, పరువమయిన పనికె పూనుకొన్నాడు. అసలే అంకెకు రాని అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యా 'ఆటంబాంబు'ను ప్రయోగించి నట్లయితే, అవి మరింత అధ్వాన్నం

50 ఏళ్ల క్రితం నాటి

కావడం తథ్యమని, అంతట ప్రపంచమే మరొక మహావినాశానికరమైపోతుందని భావించి ఆ వినాశాన్ని తప్పించడానికి కృషి చేయడమే అట్లీ శాంతియాత్ర అంతర్యం. యిందుకు బ్రిటిష్ పార్లమెంట్‌లోని వివిధ రాజకీయ వర్గాల వారందరి మద్దతు అతడికి లభించింది.

కాని ఇంతటి పూనికతో వెళ్లిన అట్లీ తన యాత్రను సఫలం చేసికొన్నాడా అని పరిశీలించుకొంటే, అది

తొరువ 10వ పేజీలో

---

# జనవాణి

## వాజ్‌పాయిది మతోన్మాద రక్తమే

ప్రధాని వాజ్‌పాయి తాను పెద్ద లౌకికవాదిగా లోకానికి కనిపించేవాడు. కాని ఆయనలో ప్రవహిస్తున్నది ఆర్‌ఎస్‌ఎస్ రక్తమని డిశంబర్ 5తేది తేట తెల్లం చేశాడు. బాబ్రీ మసీదు కూలగొట్టిన చోట రామమందిరం కట్టడమే జాతి ఆకాంక్ష అని ప్రకటించారాయన. వాస్తవానికి బాబ్రీ మసీదును కూల్చిన రోజు ఈ పెద్ద మనిషి పార్లమెంట్‌లో ప్రతిపక్ష నేతగా ప్రకటన చేస్తూ ఈ రోజు జాతికి దుర్దినం - ఈ చర్యకు సిగ్గుతో తలవంచు కొంటున్నాను. అన్నారు. కాని ప్రధాని పదవిలోకి రాగానే ఆయన ఆలోచనలు మారిపోయాయి. ఒకవైపు మైనార్టీలను బిజెపిలో చేరమని ఆ పార్టీ అధ్యక్షుడు బంగారు లక్ష్మణ్ ప్రకటిస్తున్న నేపథ్యంలో తమ పార్టీ అసలు అజెండాను బయటపెట్టిన ఘనుడు వాజ్‌పాయి. బిజెపి సెక్యులర్ నేతలు ఎవరూ లేరని వాజ్‌పాయి ప్రకటనతో తేటతెల్లం అయిపోయింది. బిజెపి పట్ల మైనార్టీలు జాగ్రత్తగా వుండడమే మంచిది.

గూడూరు షేక్ అబ్దుల్‌అజీజ్

## కలహాల కాపురం అంత మొందాలి

ఏ లగ్నాన మునిసిపల్ ఛైర్మన్‌గా తాళ్లపాక అనూరాధ పదవి బాధ్యతలు

తొరువ 10వ పేజీలో

# డిపిఓ గారి లంచాల సంసారం

జిల్లా పంచాయతీ కార్యాలయంలో అవినీతి రాజ్యమేలుతుంది. సాక్షాత్తు జిల్లా పంచాయతీ అధికారే ప్రతిపనికి ఇంత మొత్తం తనకివ్వాలని పంచాయతీ విస్తరణాధికారులు, కార్యనిర్వహణాధికారులకు టార్గెట్ విధిస్తున్నట్లు తెలి

## కమీషన్ ఇస్తేనే పర్మిషన్

సింది. పై అధికారే మామూళ్లు అడగడంలో ఇదే సందుగా క్రింది అధికారులు గ్రామాల్లోని ప్రజలను, వ్యాపారస్తులను పీల్చి పిప్పిచేస్తున్నారు. కొత్త జిల్లా పంచాయతీ కొత్త అధికారి బాధ్యతలు తీసుకోగానే గ్రామ పంచాయతీ ఎన్నికల ప్రక్రియ ప్రారంభమయ్యింది. ఓటర్ల లిస్టుల తయారీ, బ్యాలెట్ పేపర్ల ముద్రణ, ఇతర సకల సబ్బంది కార్యక్రమాలకు ప్రభుత్వం 20లక్షల రూపాయలకుపైగా నిధులు విడుదల చేసింది. ఇవేగాక జిల్లా పరిషత్, జాయింట్ కలెక్టర్ నిధుల నుంచి కూడా కొంత మొత్తం మంజూరు చేశారు. ఈ పనులన్నింటిని 50శాతం కమీషన్ ఇచ్చిన వారికే జిల్లా పంచాయతీ కార్యాలయం ధారాదత్తం చేసింది. ఈ మతలబులో ప్రభుత్వం విడుదల చేసిన సగం మొత్తం తిరిగి పంచాయతీ అధికారి జేబులోనే చేరిందట. పంచాయతీల కాలపరిమితి ముగియడంతో నోటిఫైడ్ పంచాయతీలకు

తరువ 11వ పేజీలో



పల్స్ పోలియో కార్యక్రమంలో పిల్లలకు పోలియో చుక్కలు వేస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, మునిసిపల్ ఛైర్మన్ అనూరాధ, కౌన్సిలర్ భానుశ్రీ తదితరులున్నారు.

# నెల్లూరు క్షయ ఆస్పత్రికన్నా యమలోకమే మిన్న!

పూర్వం కాశికి వెళ్తే కాటికి వెళ్లినట్లే అనే సామెతను, ప్రస్తుతం నెల్లూరులోని టిబి ఆస్పత్రికి వెళ్తే కాటికి వెళ్లినట్లేగా మార్చుకొని చదువుకోవచ్చు. నెల్లూరులోని కలెక్టర్ అధికారిక నివాస బంగళా ఎదురుగా వుండే క్షయ ఆసుపత్రిలో రోగులకు వైద్యం ఏ మాత్రం అందడం లేదు. డాక్టర్లు, నర్సులు, ఇతర వైద్య సిబ్బంది ఆస్పత్రికి వచ్చి రిజిష్టర్‌లో సంతకాలు పెట్టి ఇళ్లకు వెళ్తారే తప్ప, పొరపాటున రోగులను పరీక్షించి అవసరమైన మందులు ఇవ్వరు. దీనివల్లే ఆసుపత్రిలో ఇన్‌పేషంటుగా చేరిన ఏ రోగి పూర్తిగా కోలుకొని క్షేమంగా తిరిగి ఇంటికి వెళ్లలేకపోతున్నారు. మానవత్వం అనే మాటను ఏనాడో మర్చిపోయిన ఇక్కడి డాక్టర్లు చనిపోయిన రోగుల శవాలను నెల్లూరులోని మెడికల్ కాలేజికి అమ్మి సొమ్ము చేసుకొంటున్నారు. కొన ఊపిరితో వున్న రోగులను సైతం శవాల గదికి తరలించిన ఘన చరిత్రను ఆసుపత్రిలో పనిచేసే డాక్టర్లు, సిబ్బంది మూటగట్టుకొన్నారు.

నెల్లూరు, ప్రకాశం, కడప జిల్లాలకు చెందిన నిరుపేదలైన క్షయ రోగులకు ఉచితంగా వైద్యం అందించను 10 వార్డులు గల 225 పడకల ఆసుపత్రిని నిర్మించారు. ఆసుపత్రిలో పనిచేసేందుకు 5 మంది రెగ్యులర్ డాక్టర్లన్నారు. వీరిలో ఒకరు సివిల్ సర్జన్ (స్పెషలిస్ట్) కాగా, మరో సివిల్ సర్జన్ ఆర్.ఎం.ఓగా, మరో ముగ్గురు సివిల్ అసిస్టెంట్ సర్జన్లున్నారు. రాత్రిపూట డ్యూటీ చేసిన డాక్టర్లకు

## శవాలను అమ్ముకుంటున్నారు - బ్రతికుండగానే టపా కట్టిస్తున్నారు!

ప్రత్యేక అలవెన్సు ఇస్తారు. కాని ఇక్కడి డాక్టర్లు రాత్రుళ్లు ఇళ్లలో వుండి నెల నెలా ప్రత్యేక అలవెన్సులు తీసుకొనే ఘనాపాటీలు. ఈ ఆసుపత్రికి రాత్రిపూట ప్రాణాపాయ స్థితిలో వుండే రోగులు వస్తుంటారు. సీరియస్‌గా వుండే రోగులను రాత్రిపూట డాక్టర్లు పరీక్షించాల్సి వుంటుంది. కాని రాత్రి వేళల్లో పొరపాటున కూడా డాక్టర్లు రారు. 10 వార్డుల్లో రాత్రివేళల్లో పదిమంది నర్సులు డ్యూటీ చేయాలి. కాని వీరు 8 గంటలకే వెళ్లి తమ రూముల్లో ముసుగుతన్నేస్తారు. తిరిగి ఉదయం 8 గంటల వరకు తిరిగిరారు. దగ్గుతో ఊపిరాడక సతమతమయ్యే తమకు వార్డు బాయ్‌లు, తోటీలు ఇంజక్షన్లు వేస్తారని ఇక్కడ చికిత్స పొందుతున్న రోగులు 'జమీన్‌రైతు ప్రతినిధికి' చెప్పారు. ఉదయం 8గంటలకు వచ్చే డాక్టర్లు అన్ని వార్డుల్లోని రోగులను పరీక్షించి మందు లివ్వాల్సిందిపోయి రికార్డుల్లో సంతకాలు పెట్టి తమ రూముల్లో వెళ్లి కూర్చుంటారు. నర్సులు తెచ్చే కేస్ షీట్లను బట్టి తమకు తోచిన మందు లేవో వ్రాసి సరిపెట్టుకొంటారు. వైద్యం దైవాధీనమైన ఈ ఆస్పత్రిలో తరచూ రోగులు చనిపోతుంటారు. రోగి చనిపోయినట్లు నిర్ధారించే అధికారం డాక్టరుదయితే ఇక్కడ మాత్రం బాయ్‌లు, తోటీలే ఈ వ్యవహారంలో డాక్టర్లుగా వ్యవహరిస్తారు. ఇటీవల ఓ రోగి కోమాలోకి వెళ్లగా అతని వాస్తవ స్థితి చూడకుండా చనిపోయాడని, శవాలగదిలో పారేశారు. రెండవరోజు అతను దగ్గుతుండడంతో అతన్ని తిరిగి వార్డులోకి తెచ్చిపడేసిన ఘనులు ఇక్కడి సిబ్బంది. అప్పటి నుంచి చనిపోయిన వ్యక్తులను 24 గంటలకుపైగా వార్డుల్లోని పడకలపై నుంచి తొలగించక పోవడం వల్ల బ్రతికున్న వారు సైతం భీతిల్లిపోతున్నారు. ఆస్పత్రిలో ఇంజక్షన్లు, సిరంజీల కొరత తీవ్రంగా వుంది. ఒకే సిరంజిని వార్డు మొత్తం రోగులకు వాడుతారు. వీటిని బాయిల్ చేసే పరికరాలు చెడిపోవడంతో ఆసుపత్రిలో చేరిన రోగుల తాలూకు మనుషులు అన్నం వండుకొనే పొయ్యిల మీద దినం మార్చి దినం సూదులను కాగబెడుతున్నారు. ఇంత పెద్ద ఆసుపత్రిలో తక్కువ సంఖ్యలో లైట్లున్నాయి. కరెంట్ ఛార్జీలు పెరిగాయని పలు లైట్లను ఆర్పివేస్తుండడంతో చీకట్లో రోగుల కష్టాలు వర్ణనాతీతంగా వున్నాయి. ఆస్పత్రి చుట్టూ పెరిగిపోయిన చెట్లూ, చేమల వల్ల వార్డుల్లోకి పాములొస్తున్నాయని రోగులు వాపోతున్నారు. పేరుకు ఆసుపత్రిని శుభ్రపరచను 10 మంది కాంట్రాక్ట్ వుద్యోగులున్నా డ్యూటీకి వచ్చేది నలుగురే. వీరు ఇష్టమొచ్చినట్లు పని చేస్తారు. దీనివల్ల ఆస్పత్రిపరిసరాలను చూస్తే చాలు ఢోకొస్తుంది. 1975 సంవత్సరంలో అప్పటి కలెక్టర్ రోగుల మానసిక ఉల్లాసం కోసం అన్ని వార్డుల్లో స్పీకర్లు, ఆడియో సిస్టమ్‌ను ఏర్పాటు చేశారు. వాటి తాలూకు గుర్తులు కూడా

తరువ 11వ పేజీలో

# ఏజెంట్ల గల్ఫ్ వల - మహిళల విల, విల

దూరపు - కొండలు నునుపని తెలియక, గల్ఫ్ దేశాలకు వెళ్లి సంపాదించుకొద్దామనే ఆశతో ఏజంట్ల మాయమాటలు నమ్మి బొంబాయి వరకు వెళ్లిన యువతులు, మహిళలు దారుణంగా మోసపోతున్నారు. నెల్లూరుకు చెందిన కొంత మంది ట్రావెలింగ్ ఏజంట్లు అందమైన యువతులను, భర్తలు చనిపోయి వయసులో వున్న మహిళల పేదరికాన్ని ఆసరాగా తీసుకొని విదేశాలకు పంపుతామనే పేరుతో మోసగిస్తున్నారు. నెల్లూరుటౌన్‌లోని వెంకటేశ్వరపురం, జనార్దనరెడ్డికాలనీలతోపాటు, ఉదయగిరి, మర్రిపాడు, సీతారాంపురం ప్రాంతాలకు చెందిన మహిళలు ఈ విధంగా మోసపోయిన వాళ్లలో ఎక్కువ మంది వున్నారు. డెబ్బై నుంచి ఎనభై వేల వరకు గుంజుకొంటున్న ఏజంట్లు ఓ పదిమంది మహిళలను జట్టుగా మెడికల్ టెస్ట్‌కోసమని ముంబాయికి తీసుకెళ్తున్నారు. వీరిని వేరు వేరు చోట్ల 20రోజులకు పైగా రూముల్లో వుంచడం వల్ల తీసుకువెళ్లిన డబ్బులు అయిపోతున్నాయి. ఆ తర్వాత రంగ ప్రవేశం చేసిన ఏజంట్లు వీరికి రకరకాలుగా మాయమాటలు చెప్పి హోటళ్లకు తీసుకెళ్లి వ్యభిచార గృహాలవైపు మళ్లిస్తున్నట్లు పలువురు బాధితులు వాపోయారు. ఈ పనులకు ఇష్టపడనివాళ్లు, వీరితో గొడవలు పడి తిరిగి స్వగ్రామాలు చేరను చాలా కష్టపడాల్సి వస్తుంది. నెల్లూరు రాధా థియేటర్ సమీపంలో వున్న ఓ ట్రావెలర్స్ యజమాని ఇదే తంతుగా వ్యాపారం నడుపుతూ 10లక్షల రూపాయల మేర ప్రజలకు టోపీపెట్టి సొమ్ముతో పరారైపోయాడు. విదేశాల్లో స్థిరపడి ఛీటింగ్ చేస్తున్న ఇతడి పాపం పండి అక్కడి పోలీసులకు దొరికిపోయాడు. ఎసి సెంటర్‌లోని ఓ ట్రావెలర్స్ యజమాని నవాబుపేటకు చెందిన కొందరి వద్ద

**నెల్లూరుసంగతులు**

విదేశాలకు పంపుతానని భారీ మొత్తం వసూలు చేసి, పంపకపోయేసరికి పోలీసుల ఫిర్యాదుతో మొత్తం డబ్బులు తిరిగికట్టక తప్పలేదు. జనార్దనరెడ్డి కాలనీలో 10 మంది మహిళలు ఏజంట్ల మూలంగా తాము మోసపోయినట్లు చెప్పారు. బొంబాయి తీసుకెళ్లి తమ చేత వంటా, వార్పులు చేయించారని, బట్టలు ఉతికించారని, రాత్రి వేళల్లో మద్యం [illegible]ంచి కొందరు తమపై దౌర్జన్యాలకు పాల్పడినట్లు చెప్పారు. నెల్లూరుకు తిరిగిరాను ముంబాయిలోని టైలరింగ్ షాపుల్లో పనిచేసి ఆ డబ్బుతో తిరిగి వచ్చినట్లు ముగ్గురు బాధిత మహిళలు చెప్పారు. బొంబాయిలో జరుగుతున్న ఘోరాలను బయటకు చెబితే ఏ మహిళలు గల్ఫ్ దేశాలకు పనుల కోసం వెళ్లరంటున్నారు. మెడికల్ టెస్ట్ పూర్తయిన మహిళలను అరబ్ షేకుల ముందు పశువులను సంతలోబెట్టినట్లుగా ఏజంట్లు అమ్ముతారని వాపోయారు. నెల్లూరులోని ట్రావెలింగ్ ఏజన్సీలపై పోలీసులు ఒక కన్నేసి వీరి కార్యకలాపాల పరిశీలిస్తే పలువురు మహిళల మానప్రాణాలు, వారి కుటుంబాలను ఆర్థిక ఇబ్బందుల్లో నుంచి కాపాడిన వారవుతారు.

## మహాభారత పర్వాలపై రసరమ్య ఉపన్యాసాలు!

వర్తమాన సమాజ యాజమాన్యాన నిర్వహింపబడుతున్న శ్రీ మదాంధ్ర మహాభారతోపన్యాసాల పరంపరలో 7తేది విఆర్ కళాశాల ఆంధ్రోపన్యాసకులు డాక్టర్ ఎర్రంరెడ్డి శ్రీపతిరెడ్డి సభాపర్వం గూర్చి ఉపన్యసించారు. భారతం, భారతీయ సంప్రదాయాలకు తరగని గని, నిత్యనూతనం, సత్యబోధకం, సర్వకళా సమ్మిళితమని, ఆదిపర్వం పునాది వైతే సభాపర్వం మహాభారత వృక్షానికి పటిష్టమైన ప్రతిష్టాకాండము వంటిదన్నారు.

తరువ 11వ పేజీలో

# అటు కులం కంపు-ఇటు కాసుల ఇంపు

అన్ని ప్రభుత్వ శాఖలకు ఆద ర్శంగా వుండాల్సిన విద్యాశాఖ జిల్లాలో భ్రష్టుపట్టి పోయింది. డిఇఓ కార్యాలయం లోని ఉన్నతాధికారులు డి.ఇ.ఓ., డిప్యూటీ డి.ఇ.ఓలు, సిబ్బంది కులాలు, వర్గాలుగా విడిపోయారు. కాని అక్రమార్జనే ధ్యేయం గా ఎవరికి వారు రహస్యంగా ఉపాధ్యా యుల ట్రాన్స్‌ఫర్లు చేసుకొంటూ భారీ మొత్తంలో గడిస్తున్నారు. జిల్లాలో ఇటీవల జరిగిన రేషనలైజేషన్.

## గబ్బుపట్టిపోయిన డి.ఇ.ఓ. కార్యాలయం

కౌన్సిలింగ్‌లలో కొన్ని ఉపాధ్యాయ పోస్టుల ఖాళీలను చూపించకుండా వదిలేసి, ఇరవై రోజులుగా ఈ పోస్టు లను అమ్ముకొంటున్నట్లు తెలిసింది. ఈ యేడాది మే నెల వరకు టీచర్ల నియా మక, బదలీల వ్యవహారం జిల్లా పరిషత్ స్థాయిలో వుండేవి. ఈ బాధ్యతలు జిల్లాపరి షత్ నుంచి డిఇఓకు కట్టబెట్టడంతో రేషనలైజేషన్, కౌన్సిలింగ్‌లు ఎంతో పకడ్బందీగా జరిపినట్లు నమ్మించి, దరిదాపులు 92 పోస్టులను రహస్యంగా అట్టిపెట్టుకొన్నారు. వీటిలో కొన్ని పోస్టులు ఖాళీ అయ్యేలా చేయను డిప్యూటీ డిఇఓ కొన్ని పాఠశాలలు రద్దు చేస్తున్నట్లు ప్రచారం సృష్టించి అక్కడ పనిచేసే టీచర్లు జనరల్ ట్రాన్స్‌ఫర్లకు వచ్చేటట్లు చేసినట్లు తెలిసింది. వాస్తవానికి 37కు పైగా గ్రేడ్-1 పోస్టులు ఖాళీగా వుంటే కౌన్సిలింగ్‌లో మూడు, నాలుగు పోస్టులు; గ్రేడ్-2 పోస్టులో కేవలం రెండు మాత్రమే ఖాళీ వున్నట్లు చూపారు. డబ్బులు బాగా పనిచేయడం వల్ల ఖాళీగా వున్న పలు బియిడి పోస్టుల్లో సెకండరీ గ్రేడ్ విద్యార్హతలు కలిగినవారిని, సెకండరీ గ్రేడ్ పోస్టుల్లో బియిడి వారిని, గ్రేడ్-2 పోస్టుల్లో గ్రేడ్-1 వారిని నియమించి ఈ వ్యవహారం మొత్తం కలగాపులగం చేసిపారేశారు.

వాస్తవంగా జిల్లాలో వున్న 140 పాఠశాలల్లో పనిచేసే గెజిటెడ్ ర్యాంకు గల ప్రధానోపాధ్యాయుల, మరో 92

కొరవ 8వ పేజీలో

# మాతమ్మలను ఆదుకుంటాం

జిల్లాలో నెలకొని వున్న మాత మ్మల దురాచారాన్ని కూకటి వేళ్లతో సహా పెకలించి రూపుమాపేందుకు జిల్లా యంత్రాంగం చేసే కృషి చేస్తుందని జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్ భరోసా ఇచ్చారు. 10తేది ప్రపంచ మానవ హక్కుల దినోత్సవం సందర్భంగా ధ్యా టిస్ సంస్థ ఆధ్వర్యంలో డాక్టర్

## జిల్లావార్తలు

బి.ఆర్.అంబేద్కర్ భవన్‌లో ఏర్పాటు చేసిన మాతమ్మల సాంఘిక, సామూహిక, వివాహవేదిక కార్యక్రమంలో కలెక్టర్ ముఖ్యఅతిధిగా పాల్గొని ప్రసంగించారు. మాతమ్మలు సమాజంలో కలసిపోయే విధంగా సాంఘిక, ఆర్థికపరమైన చర్యలు చేపడతాను. మూఢ నమ్మకాలతో మాతమ్మ వృత్తిని పెంపొందించే విధంగా ఉండడం విచారకరమని, ఈ వ్యవస్థను ప్రోత్సహించే వారిపై చట్టపరంగా కఠిన చర్యలు చేపడతానని కలెక్టర్ హెచ్చరిం చారు. జిల్లాలో 238 మంది మాతమ్మలు వున్నట్లు గుర్తించామని, వీరికి పునరా వాసం కల్పించేందుకు ఒక్కొక్కరికి రెండు ఎకరాల మాగాణి లేదా ఐదు ఎకరాల మెట్ట భూమితోపాటు ఇళ్ల స్థలాలు ఇస్తామన్నారు. హౌసింగ్ కార్పొరేషన్ పక్కా గృహాలు నిర్మించి ఇస్తుంది. స్వయంఉపాధికి 20వేల రూపాయల వరకు రుణ సహాయం అందిస్తామన్నారు. మాతమ్మల పిల్లలను ప్రభుత్వ వసతి గృహంలో చేర్పిస్తామని, ఉన్నత విద్యను ఏర్పాటు చేసి వారికి మంచి భవిష్యత్తును కల్పించేందుకు కృషి చేస్తానన్నారు. ఈ సందర్భంగా కలెక్టర్ సమక్షంలో 30 మంది మాతమ్మలకు సామూహిక వివాహాలు జరిగాయి. జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి, ఎమ్మెల్యే వివేకానం దరెడ్డి, జిల్లా రిజిష్ట్రార్ ఉదయభాస్కర్, వైస్ ఛైర్మన్ సందానిబాషా, ధ్యాటిస్

కొరవ 12వ పేజీలో



మాతమ్మలకు దగ్గరుండి వివాహాలు చేయిస్తున్న వివేకానందరెడ్డి, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎస్పీ శ్రీనివాసరెడ్డి, వైస్‌ఛైర్మన్ సందానీబాషా, కౌన్సిలర్ పిండి సురేష్.

### జిల్లాలో ఆచూకీ దొరకని 12 హత్యలు

# సోదికయినా పోయిరాకూడదా?

జిల్లాలో గత రెండు, మూడేళ్లుగా జరిగిన 12హత్య కేసులను పోలీసులు ఛేదించలేక పోవడంతో అవి మిస్టరీ కేసు లుగానే మిగిలిపోయాయి. ఎంతో మంది ఎస్పీలు జిల్లాకు రావడం బదలీ అయివెళ్లడం తప్ప మిస్టరీ కేసులకు సంబంధించిన ఫైళ్లను ముందుకు కదపడం లేదు. వరికుంటపాడులో ఎస్ఐగా పనిచేస్తుండిన వెంకటేశ్వర్లును గుర్తు తెలియని వ్యక్తులు మూడేళ్ల క్రితం హత్య చేశారు. ఈ కేసు విచారణ బాధ్యతను అప్పటి ఎస్పీ ఈశ్వరరెడ్డి డిఐజి ఐడి, పార్టీలో పనిచేస్తున్న ఇప్పటి వెంకటాచలం ఎస్ఐ దేవకుమార్‌కు అప్పచెప్పారు. దేవకుమార్ ఈ కేసు విషయంలో కొంత ఆసక్తికర సమచారం రాబట్టారు. ఎస్ఐ వెంకటేశ్వర్లుకు చాలా మంది మహిళలతో అక్రమ సంబంధాలు వున్నాయని, ఓ నక్సలైటు బంధువు అయిన మహిళను ఎస్ఐ బలవంతంగా చెడగొట్టడం వల్ల, వాళ్లు ఎస్ఐ మీద కక్షగట్టి ఈ హత్యకు పాల్పడి వుండ వచ్చుననేది అనుమానం. కాని దీని తర్వాత దర్యాప్తు ఎందువల్లో జరగలేదు. అదే విధంగా బుచ్చిరెడ్డిపాళెంలో తల్లి, కొడుకులను గుర్తు తెలియని వ్యక్తులు దారుణంగా నరికి చంపారు. ఈ హత్యలు ఆస్తికోసం జరిగినట్లు పోలీసులు అను మానించి కొందర్ని అదుపులోకి తీసు కొన్నారు. బడా రాజకీయవేత్తల పైరవీలతో పోలీసులకు భారీ మొత్తం ముట్టడంతో ఈ కేసు ఫైల్‌ను అవతల విసిరి పారేశారు. బుచ్చిరెడ్డిపాళెంలోని వ్యాపారి సుందరరామిరెడ్డి మోటార్ సైకిల్‌పై పోతుండగా అతడ్ని హత్యచేసి

## కొత్త ఎస్పీగారైనా ఇక పాత కేసుల బూజు దులపాలి

వాహనంతో పాటు అతడి వద్ద నగదు కూడా దుండగులు దోచుకు పోయారు. ఈ కేసు విచారణ ముందుకు సాగలేదు. సావిత్రినగర్ 1వ వీధిలో పార్వతి అనే వృద్ధురాలిని గుర్తు తెలియని వ్యక్తులు మెడకు తాడు బిగించి దారుణంగా హత్యచేసి సొత్తు దోచుకెళ్లారు. గత ఏడాది అల్లూరు సమీపంలోని పెట్రోలు బంకు వద్ద ఇద్దరు అమాయకులను అన్యాయంగా చంపి, డబ్బు దోచుకెళ్లారు. ఈ హత్యకు కారకులను పట్టేసినట్లే అప్పటి ఎస్పీ నరసయ్య చెప్పారు. కాని ఫలితం శూన్యం. బాలాజీనగర్‌లో పుల్లయ్యనాయుడు ఆయన భార్యను కూడా గుర్తు తెలియని వ్యక్తులు కత్తు లతో పొడిచి చంపి సొత్తు దోచుకెళ్లారు. ఇటీవల కాలంలోనే చిల్డ్రన్స్ పార్కు సమీపంలో ఒక మహిళపై అత్యాచారం జరిపి ఆమెపై కిరోసిన్ పోసి తగుల బెట్టారు. ఈ మహిళ ఎవరైంది కూడా పోలీసులు ఇప్పటి వరకు తేల్చలేక పోయారు. గత నెలలో సంతపేటలో జరిగిన గృహిణి వెంకటరత్నమ్మ హత్య బసవాయపాళెం జంట హత్యల కేసు కూడా మిస్టరీగా మిగిలిపోయింది. ఇదేగాక పలు స్టేషన్ల పరిధిలో ఇటువంటి ఎన్నో కేసుల దర్యాప్తు ముందుకు సాగడం లేదు. సిబ్బంది కొరత, వివిఐపి బందోబస్తు డ్యూటీలు. ఇతర పనిభారం వల్ల సుదీర్ఘ కాలం పాటు కేసులు విచారించడానికి సమయం దొరకడం లేదని పోలీసులు చెబుతున్నారు. జిల్లాలో పోలీసు స్పెషల్ పార్టీ వున్నప్పటికీ వారు ఇటువంటి కేసుల జోలికి వెళ్లడం లేదు.

కొరవ 8వ పేజీలో

## కలెక్టర్‌పై ధ్వజమెత్తిన రెవిన్యూ ఉద్యోగులు

జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్‌పై జిల్లా రెవిన్యూ ఉద్యోగుల సంఘం ధ్వజమెత్తింది. జిల్లా కలెక్టర్ ఎంతో ముచ్చటపడి నిర్వహిస్తున్న ప్రజాదర్బార్ కార్యక్రమంలో ఇక నుండి పాల్గొనబోమని తెల్చి చెప్పేసింది. ప్రజాదర్బార్ వల్ల అధికారులను ఇబ్బంది పెట్టడం మినహా ఎటువంటి ప్రయోజనం లేదంది. ఈ కార్యక్రమంలో ప్రజల ఫిర్యాదులు, వినతులపై కలెక్టర్, జాయింట్ కలెక్టర్ ఒక నిర్ణయం తీసుకోకుండా ప్రతి విషయానికి ఎమ్మార్వోలను పిలిచి అవమానపర్చే రీతిలో మాట్లాడుతున్నారని రెవిన్యూ ఉద్యోగుల సంఘం ఆక్షేపించింది. కలెక్టర్ సమయం, సందర్భం లేకుండా వున్న ఫలంగా రమ్మని పిలిచి ఉదయం నుంచి రాత్రి 12 గంటల వరకు సమావేశాలు నిర్వహిస్తూ ఉద్యోగులను అవస్థల పాలు చేస్తున్నారు. ఇక నుండి రెవిన్యూ శాఖాపరమైన పనులు మినహా ఇతర పనులు చేయలేం. కలెక్టర్, జాయింట్ కలెక్టర్ ప్రజల మెప్పు పొందేందుకు వుద్యోగులను వేధిస్తున్నారు. ప్రజాప్రతి నిధులు నిర్వహించాల్సిన ప్రజాదర్బార్‌ను కలెక్టర్ నిర్వహించడమేమిటని రెవిన్యూ ఉద్యోగుల సంఘం నేతలు ప్రశ్నించారు. ఉన్నతాధికార్లు లిఖిత పూర్వక ఉత్తర్వులివ్వనిదే ఎమ్మార్వో మండల కేంద్రాల్లో వారి ఆదేశాలను అమలు పర్చలేరని అసహాయత వ్యక్తం చేశారు. ఇక నుంచి రెవిన్యూ పరంగా కలెక్టర్ ఆదేశాలను మాత్రమే పాటిస్తామంటున్నారు.

కలెక్టర్‌పై రెవిన్యూ ఉద్యోగులు ధ్వజమెత్తడానికి ఆయన అనుసరిస్తున్న ఏకపక్ష వైఖరే కారణమనాలి. ఈ సహాయ నిరాకరణ కొనసాగనీయకుండా ఇరు వర్గాలు సుహృద్భావ వాతావరణంలో చర్చించుకొని ఒక నిర్ణయానికి రావడం ఉత్తమం. పంతాలకు పోతే జిల్లాలో పరిపాలన భ్రష్టు పట్టిపోతుంది.



## రహస్యమెందుకో?

తమది పారదర్శకమైన ప్రభుత్వమని తెలుగుదేశం నేతలు గొప్పగా చెబుతుంటారు. కాని వారి నేతృత్వంలో పని చేసే అధికారులు రహస్య ప్రభుత్వం నడపాలని చూస్తున్నట్లున్నారు. జూలై 3తేది ప్రాథమిక విద్యా శాఖ జారీ చేసిన టీచర్ల రిక్రూట్‌మెంట్ (డిఎస్‌సి) నోటిఫికేషన్‌లో జిల్లాలో 857 పోస్టులు ఖాళీగా వున్నట్లు ప్రకటించారు. ఆగష్టులో వీటి భర్తీకి పరీక్షలు నిర్వహించి అక్టోబర్‌లో ఫలితాలు ప్రకటించారు. నవంబరులో ఎంపికైన వారికి పోస్టింగ్ ఆర్డర్లు కూడా ఇచ్చారు. కాని జిల్లా నుంచి ఎంత మందిని ఎంపిక చేసింది, ఏ ఏ కులాలు, వర్గాల వారికి ఎన్ని పోస్టింగు లిచ్చింది డిఇఒ ఇంత వరకు ప్రకటించలేదు. ఈ ఎంపికలో ప్రధాన భూమిక నిర్వహించిన జాయింట్ కలెక్టర్ అయినా ఎంపిక పూర్తికాగానే ఈ వివరాలు ప్రకటించాల్సింది. కాని ఆ పని చేయలేదు. ఇప్పటికైనా అధికారులు ఈ వివరాలన్నీ ప్రకటిస్తే వారిపై వస్తున్న పలు ఆరోపణలకు సమాధానం చెప్పిన వారవుతారు. లేకుంటే అధికారుల మీద వస్తున్న ఆరోపణలన్నీ నిజమని నమ్మాల్సి వస్తుంది.

## పోలీసు అదుపులో విగ్రహాల దొంగల ముఠా

జిల్లాలోని వివిధ దేవాలయాల్లో విగ్రహాలు దొంగిలించిన దొంగల ముఠాను ఐదవ పట్టణ క్రైం పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. ఈ ముఠా దేవాలయాల్లోని పంచలోహ విగ్రహాలను వాటి మెడలోని బంగారు నగలను దొంగిలించి మద్రాసు, బెంగుళూరు నగరాల్లో అమ్మేవారట. ఈ మధ్య విగ్రహాలను అమ్మేందుకు తీసుకవెళ్తుండగా పాపం పండి పోలీసులకు దొరికిపోయారు.

## స్మైల్ దంతవైద్యశాల

నెల్లూరు రమేష్‌రెడ్డి నగర్‌లో డాక్టర్లు జి.కిరణ్, షేక్ ఉస్మాన్‌లు 'స్మైల్' పేరిట దంత వైద్యశాలను ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవానికి నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, మాజీ ఎమ్మెల్యే రమేష్‌రెడ్డి, ఉత్తమ డేస్ ఇన్ హోటల్ అధినేత ధనుంజయరెడ్డి రత్నం, నారా

తారువ 7వ పేజీలో










# సణుగుడు

* మామ అల్లుళ్ల తిరుగుబాటు మంత్రి ధూపం తెంచలేదు.
* ప్రసన్న శాపనార్థాలు.
* వై.టి. నాయుడు మీద నిందలు

జిల్లా తెలుగుదేశం రాజకీయాలలో ప్రకంపనలు సృష్టించగలడనుకున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిల కలయిక తుస్సుమని తేలి పోయింది. జిల్లాలోని తతిమా తెలుగు నేతలందరినీ సమీకరించి, మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డిని ఒంటరి చేయాలని వీరిద్దరు పన్నిన వ్యూహం ఫలించలేదు.

వీరి పునర్వివాహం జరిగిన తొలి నాలుగైదు రోజులు బాగా సందడిగా వుండింది. మంత్రికి వ్యతిరేకంగా వెళ్లే వారి పేర్లు బాగా వినపడుతుండినాయి. కాని రోజులు గడిచేకొద్ది ఆ మార్పు కన్పించడం లేదు. పైపెచ్చు మంత్రికి తాము వ్యతిరేకం కాదని, తాము వర్గాలు కట్టడం లేదని ప్రత్యేకంగా ప్రకటనలు ఇచ్చే వారి సంఖ్య పెరిగిపోతున్నది. మాజీ మంత్రి పరసారత్నం, మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు కూడా ఇట్లా ప్రకటనలు చేశారు. మామా అల్లుళ్ల బృందంలో చేరిన చెప్పుకోదగ్గ వ్యక్తి ఒక్క రమేష్‌రెడ్డి మాత్రమే. ఆయనలో కూడా మొదట వుండిన వుత్సాహం కన్పడడం లేదు.

చెన్నారెడ్డి పెంచలరెడ్డి విషయంలో ఎవరిది పైచేయి అన్న విషయంలో ఇంకా తేటతెల్లం కాలేదు. చంద్రమోహన్‌రెడ్డి చెప్పడం - పెంచలరెడ్డిని అధికార పర్యటనలలో, పార్టీ కార్యక్రమాలలో తిప్ప వద్దని ముఖ్యమంత్రి హెచ్చరిక చేశాడని; కాని ప్రభాకరరెడ్డి ఈ వాదంతో ఏకీభవించడం లేదు. పెంచలరెడ్డి విషయంలో తాను ఏ తప్పు చేయలేదని, తనతో ముఖ్యమంత్రి ఈ విషయం మాట్లాడలేదని చెప్తున్నారు. అయితే చంద్రమోహన్‌రెడ్డి చెప్పినట్లు ఇప్పటి వరకు పెంచలరెడ్డి పార్టీ సభ్యత్వం రద్దు కావడం లేదా దానిపై సమన్వయ కమిటీ సమావేశం కావడం జరగలేదు.

ఇటు చంద్రమోహన్ అటు ప్రసన్నకుమారరెడ్డిలిరువురు ఒకరిని మించిన జగత్ కంత్రీలు. ఆ సంగతి అందరికీ తెలుసు; అందువల్లే జిల్లాలోని ఏ ఒక్క తెలుగు నేత కూడా వీరిని నమ్మి వీరితో చేతులు కల్పడానికి సిద్ధంగా లేరని భావించవచ్చు.

***

కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమారరెడ్డి గారు జమీన్‌రైతును శాపనార్థాలు పెడుతున్నారు; తనమీద అనవసరంగా విమర్శలు వ్రాస్తున్నారన్నది ఆయన బాధ. ఆ పత్రిక అంతే, మా తండ్రి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి మీద కూడా ఇట్లానే వ్రాసేది. ఇప్పుడు నామీద వ్రాస్తున్నది అని నిష్ఠూర పడుతున్నారాయన. పిల్లి శాపనార్థాలకు ఉట్లు తెగనట్లే, ప్రసన్న నిష్ఠూరాల వల్ల మాకు జరిగే నష్టం ఏమీ లేదు. కాని ఇక్కడ సమస్య తిట్లు, శాపనార్థాలు కాదు.

ప్రసన్న మీద మాకు వ్యక్తిగతంగా ఎటువంటి వ్యతిరేకత లేదు; అసలాయనతో మాకు సంబంధాలు కూడా లేవు. పత్రికలో వ్రాసింది ఆయన అవినీతి పనుల గురించి మాత్రమే. నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డితో తనను పోల్చుకుని మాట్లాడుతున్నాడాయన. ఆయన ఈయనకు తండ్రి అన్న మాట నిజమే కాని, నక్క ఎక్కడ, నాగలోక మెక్కడ? శ్రీనివాసులురెడ్డిలోని నాయకత్వ లక్షణాలలో, వ్యక్తిత్వ సుగుణాలలో ఒక్కటైనా వుందా ప్రసన్నలో?

మా వార్తలలో చేసిన ప్రధాన ఆరోపణ - ప్రసన్న దండకాలు, అది నిజం కాదని చెప్పగలడా ఆయన? కోవూరులో పిడబ్ల్యుడి, పంచాయతీరాజ్ ఇంజనీర్లలో ఆయనకు నెల మామూళ్లు ఇవ్వని అధికారి ఎవరూ లేరన్నది అందరికీ తెల్సిన నిజం. మామూలు ఇవ్వడంలో ఏ మాత్రం తేడా వచ్చినా ఆ అధికారి బదలీ కావడం ఖాయమన్నది సైతం నిరూపణ అయిన నిజం. తన తరఫున దండకాలు చేయడానికి కలెక్షన్ ఏజంట్లను కూడా నియమించుకుని వున్నాడు ప్రసన్న.

కోవూరు నియోజక వర్గం నుంచి దాదాపు రెండు వందల మందికి ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి ఆస్పత్రి ఖర్చులకు డబ్బు విడుదల అయ్యింది. గుండె జబ్బులు, కిడ్నీ జబ్బుల పేరుతో లక్షలాది రూపాయలు విడుదల చేసింది ప్రభుత్వం. కాని ఇందులో నిజమైన రోగుల సంఖ్య చాలా కొంచెం. సగానికి పైగా దొంగ కేసులు. అసలు ఏ జబ్బు లేని వారు కొందరైతే, పెద్ద పెద్ద రైతు కుటుంబాలకు చెందిన వారు మరి కొందరు. కలెక్టర్‌గా శ్రీమతి శ్రీలక్ష్మి వున్నప్పుడు ఈ డబ్బు పందేరం విస్తృతంగా జరిగింది. అందుకోసం ఆయన లక్ష్మి గారిని నిజమైన లక్ష్మిదేవి వలె కొలిచేవాడు. పత్రికలలో ఆమె ఫోటోలు వేసి గొప్పగా ప్రకటనలు వేయడంతో పాటు, తరచు ఇంటికి తీసుకవెళ్లి ఖరీదైన పట్టు చీరలు పెట్టి పంపేవాడట. ఇంటి ఆడపడుచు వలె ఆమెను సత్కరించాడనికి వేరే కారణం ఏదీ లేదు. ఈ మాదిరి ప్రభుత్వ ధనం దిగమింగడమే. ఈ నిజం కాదనగలడా ప్రసన్న? ఇప్పటి కలెక్టర్ గారిని కూడా ఇదే రీతిలో బుట్టలో వేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆయన ద్వారా ఇంకెన్ని లక్షలు తినాలని వ్రాసి పెట్టి వుందో ప్రసన్నుడిటి మీద! పత్రికలలో ఒక విమర్శ వస్తే రాజకీయ వాది చేయవల్సింది ఆ పత్రికకు అపార్థాలు అంటగట్టడం కాదు; ఆ విమర్శ నిజమో కాదో ప్రజలకు తెలియ చెప్పడం. తన మీద వచ్చిన ఆరోపణలు వీటిని కాదు అని చెప్పగల్గిన పరిస్థితిలో లేడాయన. అందువల్లే ఈ శాపనార్థాలు. ఆయన తృప్తి మేమెందుకు కాదనాలి - ఇవి మాకు అలవాటే కదా?

***

వైటి నాయుడు మీద గత వారం రోజులుగా పలురకాల నిందలు విన్పిస్తున్నాయి. ఒకదిన పత్రిక అయితే నేరుగా ఆయన్ను అరెస్టు చేసినట్లు వార్త ప్రకటించింది. రాజకీయాలలో వుండే వారికి నిందలు భరించక తప్పదు. కాని అవి రాజకీయ పరమైనవైతే

తారువ 7వ పేజీలో

## డోలేంద్ర

## మాటలు తప్ప

మొదటి పేజీ కొరవ

మాట వింటే, రోజుల తరబడి ఎదురు చూడడం తప్ప ధాన్యం అమ్మగలిగే పరిస్థితి కన్పడడం లేదు. రైతులు ఎంత కాలం వేచి వుండగలరు? మార్కెటింగ్ యార్డులలో రైతులకు కనీస వసతులు కూడా వుండవు. ధాన్యం ఆరుబయట కుప్ప పోసి కాపలా వుండాలి. ఇల్లు, వాకిలి వదలి రోజుల తరబడి, రాత్రి పగలు మార్కెటింగ్ యార్డులలో వుండడం సాధ్యమయ్యే పనేనా? విసిగి పోయిన రైతులు ప్రభుత్వాన్ని శాపనార్థాలు పెడుతు, అయినకాడికి అమ్ముకుని ఇళ్లకు వెళ్లి పోతున్నారు.

మార్కెటింగ్ యార్డుల సౌకర్యం లేని నెల్లూరు వంటి జిల్లాలలో కొన్ని వేల పుట్ల వడ్లు రైతుల ఇళ్ల దగ్గర మగ్గి పోతున్నాయి. అమ్ముకోలేరు, దాచిపెట్టుకోలేరు. అమ్ముదామంటే ధర లేదు; దాచి వుంచడానికి స్థలం ఒక సమస్య. ఎలకలు, పందికొక్కులది ఇంకోక సమస్య; అన్నిటికి మించి రెండవ పంట వేయడానికి, ఇల్లు జరుపుకోవడానికి, తెచ్చిన అప్పులు కట్టడానికి డబ్బు కొరత ఇంకా పెద్ద సమస్య. ఎవరో పది శాతం మంది తప్ప అధిక భాగం రైతులు ధాన్యం నిల్వ చేయలేరు. వీరి గోడు వినడానికి వీలు లేకుండా వుంది; వారి పరిస్థితి దయనీయంగా వుంది.

ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? ప్రభుత్వం, మరీ ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వం రైతుల సమస్యను అర్థం చేసుకుని ఆదుకోవడం మాత్రమే దీనికి పరిష్కారం. అందుకు ప్రభుత్వం చేయదగిన, చేయవల్సిన పని- రైతుల నుంచి నేరుగా ధాన్యం, ఇతర ఆహార ఉత్పత్తులు మద్దతు ధరలకు కొనుగోలు చేయడం. గతంలో ఇటువంటి పరిస్థితి తలెత్తినప్పుడు రాష్ట్ర ప్రభుత్వం రైస్ మిల్లులు, వాటి గోడౌన్లు స్వాధీనం చేసుకుని, ధాన్యం కొనుగోలు జరిపి, ఎఫ్‌సిఐకి విక్రయించిన సంఘటనలు వున్నాయి. ఈ వ్యాపకం వల్ల శ్రమ తప్ప, ప్రభుత్వానికి వచ్చే నష్టం లేదు. మద్దతు ధరకు వడ్లుకొని, మిల్లులో ఆడించి, బియ్యం లెవీ క్రింద ఎఫ్‌సిఐకి తరలించి, తవుడు వంటివి అమ్మివేస్తే వచ్చే రాబడికి, లెవీ బియ్యం ధర సరిపడేటట్లు మద్దతు ధర నిర్ణయం అవుతుంది కాబట్టి ప్రభుత్వానికి వచ్చే నష్టం ఏమీ వుండదు. మిల్లర్లు ఎందుకు ఆ ధర ఇవ్వడం లేదు. అంటే, తాము తప్ప మరెవరు కొనేవారు లేరు కాబట్టి. డిమాండ్, సరఫరా సూత్రం ప్రకారం వ్యాపారం చేసే వారు ఉచితంగా వచ్చే లాభం వదలుకుని ఎందుకు అధిక ధరలు చెల్లిస్తారు? వారిలో కదలిక వచ్చి రైతుకు కనీస ధర ఇవ్వాలంటే, వారి వ్యాపారానికి పోటీ వుండాలి. ఆ పోటీని రాష్ట్ర ప్రభుత్వం సృష్టించగలిగితే చాలు; పరిస్థితి మారి పోతుంది. కాని ప్రభుత్వం ఆ ఆలోచన చేయడం లేదు. ఎఫ్‌సిఐ అధికారుల మీద కేకలు పెట్టడం, కేంద్ర ప్రభుత్వాన్ని నిందిస్తూ పత్రికా ప్రకటనలు చేయడం మాత్రమే ఆయన చేస్తున్న పని.

ధాన్యం కొనుగోలు ఎందుకు ప్రారంభించలేదు - ప్రభుత్వం? మనకు కనపడుతున్న ఒకే ఒక కారణం - డబ్బు కొరత. ప్రభుత్వ ఖజానాలో చిల్లి గవ్వ లేదు. ఇటువంటి అవసరాల కోసం మార్కెటింగ్ శాఖ ఒక దాన్ని సృష్టించి, దాని డబ్బు రాష్ట్ర ప్రభుత్వం తన ఖర్చులకు వాడడానికి లేదని రాజ్యాంగ నిబంధన విధించారు మన పూర్వీకులు. కాని చంద్రబాబు ఆరు నెలల క్రితం జరిపిన నీరు - మీరు కార్యక్రమానికి మార్కెటింగ్ శాఖలోని నిధులన్నింటిని వాడేశాడు. అందుకు అభ్యంతర పెట్టిన ఆనాటి చీఫ్ సెక్రటరిని రాత్రికి రాత్రి బదలీ చేసి మరీ మార్కెటింగ్ నిధులు కాజేశాడు ముఖ్యమంత్రి. ఇప్పుడు ధాన్యం కొనుగోలు చేయడానికి డబ్బు లేదు. నీరు మీరు కార్యక్రమం వల్ల తెలుగుదేశం కార్యకర్తలకు చేతినిండా పని, జేబు నిండా డబ్బు దొరికాయి; ఆ దుర్వినియోగం ఫలితంగా ఈ రోజు రైతులకు కన్నీళ్లు మిగిలాయి.

పరమ దుర్మార్గం ఇది. దండగ మాలిన పనులకు, అనవసర ప్రచారాలకు వందలు, వేల కోట్ల ఖర్చు చేసే రాష్ట్ర ప్రభుత్వం రైతుల కోసం నాలుగైదు వందల కోట్లు కేటాయించి, వారి బ్రతుకులలో ఏర్పడిన అయోమయ పరిస్థితిని తొలగించడానికి మాత్రం ఖాళీ ఖజానాను చూపి తప్పించుకోవడం దుర్మార్గం. ముఖ్యమంత్రి తన మాయ చేష్టలు, పత్రికా ప్రకటనలకు, ఆకస్మిక పర్యటనా ప్రహసనాలు మాని, తక్షణం సహకార మార్కెటింగ్ సంస్థలను, మార్క్‌ఫెడ్ వంటి సంస్థలను రంగంలోకి దింపి ధాన్యం కొనుగోలు ప్రారంభింప చేయాలి. అది జరిగిన మరుక్షణం మిల్లర్లు కూడా ముందుకు రాక తప్పదు.

మద్దతు ధర ఇవ్వని మిల్లర్లపై చర్య తీసుకుంటానని ఇప్పటికి పదిసార్లు ప్రకటనలు చేశాడు ముఖ్యమంత్రి; కాని అటువంటి చర్య తీసుకున్నట్లు ఒక్క వార్త అయినా చదివామా, విన్నామా మనం? అది ప్రభుత్వ అసలు రంగు.

**Before the Dist. Consumers Disputes Redressal Forum, Nellore**

O.P. No. 629/97

M. Dharma Reddy ... Petitioner

Vs.

1. S. Nagarjuna Rao;
2. P. Ravindra Babu ... Respondents

TO : Sarvepalli Nagarjuna Rao, s/o Late S.L. Kantha Rao, No. B-32, Karthikeyan Salai, Periar Nagar, Chennai-82

పై కేసులో మీరు మొదటి ప్రతివాది అయినందున మీ నోటీసుకు గాను 20.12.2000 తేదికి వాయిదా వేసి యున్నారు. ఆ రోజు ఉదయం 10.30 గంటలకు పై ఫోరం వారి ముందు హాజరై మీకు గల ఆక్షేపణలు తెలుపుకొనవలసినది, లేని యెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

**D. Venkata Ramaiah**
Advocate,
Tekkemitta, Nellore.

**In the Court of the Dist. Judge (MACT), Nalgonda**

O.P. No. 191 of 2000

Between:

D. Yadaiah ... Petitioner

And

N. China Kotaiah & another ... Respondents

**Notice to the Respondent No. 1**

TO : N. China Kotaiah, s/o Venkaiah, aged: Not known, Occu: Owner of Lorry No. AP-26-T-1279, R/o 3/6-52, Arunachalam Street, Stonehousepet, Nellore

Take notice that the petitioner filed a motor accident claim petition against you the case is posted to dated 19.12.2000 for your appearance. If you fail to appear on the above said date by 10.30 AM you will be set exparte and dicided the case in your absence.

*// By order of the Court //*
P. SHYAM SUNDER
N. CHANDRASHEKHER
B. TYAGARAJU
K. PARAMESWAR
**Advocates, Shivaji Nagar Nalgonda**

## ఆంధ్ర నేతలు

మొదటి పేజీ కొరవ

సుబ్బరామిరెడ్డి గారు.

సిడబ్ల్యుసికి పోటీ చేయాలన్న ఆలోచన సిఎల్పీ నేత డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి గారికి వుండింది. కాని సిఎల్పీ, పిసిసి అధ్యక్షులు ఈ పోటీలో పాల్గొన కూడదని ఆంక్ష విధించడంతో ఆయన పోటీ నుంచి తప్పుకోలేక తప్ప లేదు.

ఎన్నికలు జరగకుండా సోనియా గాంధీ నేరుగా 12 మంది సభ్యులను ఎంపిక చేయాలన్న వాదన కూడా ఒకటి బలంగా వుంది. సీనియర్ నేతలు చాలా మంది ఎన్నికలంటే భయపడుతున్నారు. కుర్ర కారు నేతలతో పోటీ పడి తాము నెగ్గలేమన్న అనుమానం వీరిలో వుంది. అందువల్ల నామినేషన్ పద్ధతి పాటిస్తే ఏ గొడవ వుండదని వీరి వాదన. ఎన్నికలు జరిపితే ఎవరెవరో గెల్చుకుని వచ్చి, కీలకమైన ఈ సంస్థలో చికాకు సృష్టిస్తారని వీరు సోనియాగాంధీని భయపెడుతున్నారు.

మరొక రెండు వారాలు గడిస్తే కాని ఎన్నికలపై ఒక స్పష్టమైన నిర్ణయం జరిగేటట్లు లేదు.

## కేసులెందుకు

మొదటి పేజీ కొరవ

సంబంధాల దృష్ట్యా హై కోర్టులో తనకు న్యాయం జరగదని ఆయన భయపడుతున్నారని, అందువల్లే ఈ పోరాటం సుప్రీం కోర్టులో చేయాలని నిర్ణయించారని తెలుస్తున్నది. నిజం మనకు తెలియదు.

## సణుగుడు

6వ పేజీ కొరవ

భరించడానికి చింత పడవల్సిన పని లేదు. కాని వ్యక్తిగత ఆరోపణలు, శీలంపై శంకలు కూడా; ఆధారాలు, నిజాలు లేకుండా పత్రికలలో వార్తలుగా వస్తే ఎవరికైనా మనఃక్లేశం కల్గడం సహజం.

వైటి నాయుడు సిటీ ఫైనాన్స్ కార్పొరేషన్ అనే సంస్థ ద్వారా ప్రజల డబ్బు తిన్నాడన్నది ప్రధానమైన నింద; అందుకోసం మద్రాసు పోలీసులు ఆయన్ను అరెస్టు చేశారన్నది వార్త. వైటి తత్త్వం, జీవన శైలి తెల్సిన వారెవరు వీటిని నమ్మలేరు. ఏ పదవి లేకుండా, ఎవరికి వుపయోగపడకుండా, ఏ ఎన్నికలోనూ గెలవకుండా, ఏ ఒక్కరితోనూ ఒడ్డిక లేకుండా, వైటి. నాయుడు నెల్లూరు టౌన్లో రాజకీయవాదిగా బ్రతికి వున్నాడంటే - అందుకు ఒకే ఒక కారణం - అతడి వ్యక్తిత్వం. ఇరవయ్యేళ్లకు పైబడి రాజకీయాలలో వున్న ఒక్క సందర్భంలోను ఒక్క అవినీతి పనికి పాల్పడినట్లు ఏ ఒక్కరి చేత అనిపించుకోలేదు. తన జేబు ఖాళీ చేసుకోవడం తప్ప ఇంకొకరి జేబులో చెయ్యి పెట్టడం తెలియదు. అందువల్లనే అన్ని ఆగచాట్లు. ఇది తెల్సి కూడా వైటి ప్రజల డబ్బు తిన్నాడని వార్తలు వ్రాయడం అన్యాయం. అరెస్ట్ అనేది మరీ దుర్మార్గ వార్త. మన సమాజంలో పోలీసుల అరెస్ట్ అనేది సంబంధిత వ్యక్తిని మానసికంగా చిత్రహింస పెట్టే విషయం. రాజకీయాలలో వుండే వారే కాదు, సగటు మనుషులు కూడా అరెస్ట్ అనే పరిస్థితి వస్తే కృంగి పోతారు. జరగని అరెస్ట్ జరిగినట్లు వార్త వస్తే ఆ వ్యక్తి పరిస్థితి ఏమిటి? ఎందరిదగ్గరికి వెళ్లి తాను అరెస్టు కాలేదని చెప్పుకోగల్గుతాడు? ఆ అపనింద వల్ల కల్గే సామాజిక అప్రతిష్టను ఎట్లా రూపుమాపుకోగల్గుతాడు.

వైటికి ఈ పరిస్థితి కల్గడం విచారకరం; అతడికి మా సానుభూతి.

అసలు ఈ సిటీ ఫైనాన్స్ స్వాహా సంగతి ఏమిటి? వైటి అరెస్టు నిజం కాక పోవచ్చు కాని, స్వాహా మాత్రం నూటికి నూరు పాళ్లు నిజం. ఇందులో దోషులైన వారు నెల్లూరులో చాలా పెద్ద మనుషులు; మంచి స్థితిమంతులు. ఎంత సంపద వున్న ఇంకా జనం సొత్తు తినాలనే దురాశ ఎందుకు వీరికి? ఇటువంటి వారిని కఠినంగా శిక్షించడం పోలీసు కర్తవ్యం.

స్మైల్ దంత వైద్యశాలను ప్రారంభిస్తున్న రత్నం సంస్థల అధినేత కె. రత్నం. ప్రక్కన హాస్పిటల్ డాక్టర్స్ కిరణ్, ఉమ్రాన్.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

యణ విద్యా సంస్థల అధినేతలు కె.వి. రత్నం నారాయణ హాజరయ్యారు. కంప్యూటరైజ్డ్ ఇన్‌ట్రా ఓరల్ స్కానింగ్ అండ్ అనాలసిస్ సౌకర్యం 'స్మైల్' హాస్పిటల్‌లో వుంది.

### మరణం

నిరాడంబరుడైన పొట్లపూడి రైతు ఇందుపూరు రమణారెడ్డి (84) హైదరాబాద్‌లో తన చిన్న కుమారుడి ఇంటి వద్ద 11తేది మరణించారు. ఆయనకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. వారి కుటుంబానికి మా సానుభూతి.

# వాస్తులో 'ఆయం' మాయం!

**వాస్తుసంగతులు**

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి

*(గతవారం తరువాయి)*

శాస్త్రంలో ఫలానాగది, ఫలానా ఆయంలో కట్టాలని నిర్దేశించినప్పుడు, ఆ సూత్రాలకు చెడు ఫలితాలు వుండ కూడదు కదా? మరి 8 ఆయవర్గాలకు 8 వివిధ లక్షణాలున్నాయి. అటువంటప్పుడు ఈ ఆయ విధానాన్నెందుకు నిర్ధారించినట్లు?

శేషం 1 అయినప్పుడు ధ్వజాయమవుతుంది. చట్టం ప్రకారం ఇది తూర్పు దిక్కులో స్నానపుగది రావాలి. ధ్వజాయం వల్ల ధనం, జయం కలుగుతుందట మంచిదే.

వంటగది ఆగ్నేయంలో కడతారు. అది ధూమాయంలో రావాలట. అంటే శేషం 2 రావాలి. సరే ఇలా నిర్ధారించినప్పుడు ఫలితాలు చూడండి ఎలా వున్నాయో?

ధూమాయం వల్ల వ్యాధి, స్త్రీ వ్యాధులు కలుగుతాయట. మరీ ఆయాన్ని ఎందుకు నిర్ణయించినట్లు? సహజంగా వంటగది 'ధూమ' స్థానం. అదీ స్త్రీ వ్యాధి కారకమే. అయితే దీనికి విరుగుడు ఏమిటి? ధూమాయాన్నే ఎందుకు నిర్ణయించారు? దీనికి సమాధానం శాస్త్రం చెప్పదు. అట్లాంటప్పుడు ఈ 'ఆయా'ల్లోనే గదులు ఎందుకు నిర్మించుకోవాలి. ఇవన్నీ సమాధానాలు లేని ప్రశ్నలు. ఇక సింహాయం, శత్రునాశనకారకం, ఆరోగ్య, ఆర్థిక సౌభాగ్యాలూనట? ఎందువల్ల ఇట్లా కలుగుతాయో తెలియదు. సింహాయంలో పడక గదులు నిర్మించాలట.

శ్వానాయం శేషం 4 వచ్చిన గది. ఆయుధాల గది నిర్మించాలట. ఈ కాలంలో ఈ గది నిర్మించి ఏ ఆయుధాలు దాచుకోవాలి? ఇది నైరుతిలో రావాలట?

మరి ఆధునిక కాలంలో నైరుతి గదిని యజమానుల పడకగదిగా వాడుతున్నాం కదా? ఇలా వాడమని శాస్త్రమే చెప్పింది మరి!

పశ్చిమంలో వృషభాయంలో (శేషం 5) భోజనశాల నిర్మించుకోవాలి. ఇది శుభాన్ని, ధనాన్ని అందజేస్తుందట. ఉత్తరం గజాయంలో 'ఖజానా' గది నిర్మించుకోవాలి. ఈ ఆదాయం తేజస్సునిస్తుందట.

ఈశాన్యంలో కాకాయంలో (8) పూజా గృహాన్ని నిర్మించుకోవాలట. అయితే ఈ ఆయం శోకానిస్తుందట. ఇంత వరకూ బాగానే వుంది. గది పొడవుబాగానే వుంది. గది పొడవు, వెడల్పులను గుణించి 9చే గుణించి, 8చే భాగించినప్పుడు శేషం రాకపోతే '0' వస్తే అప్పుడదే ఆయమవుతుందో శాస్త్రంలో వివరించలేదు.

### మరికొన్ని సంగతులు

ప్రాచీన శాస్త్రాల్ని పరిశీలిస్తూ వుంటే మరొక అంశం కంటపడింది. వశిష్ఠ వాస్తులో ఇట్లా వుంది. 11యవల ప్రమాణం నుండి 32 యవల వరకూ వున్నా గృహాలకు ఆయం అవసరం లేదన్నారు. యవల ప్రమాణమేమిటో చూద్దాం! 8 యవలు ఒక అంగుళమన్నారు. శాస్త్రంలో 11 యవలు అంటే ఒక అంగుళాన్ని మించి 3 యవల ప్రమాణమన్నమాట. అట్లాగే 32 యవలు 4 అంగుళాలన్నమాట - ఈ కొలతలతో ఏ రకమైన ఇళ్లు నిర్మించబడతాయో అర్థం కాదు. మరుగుజ్జులకు సైతం ఈ ఇళ్లు చాలవు కదా మరి?

16హస్తాలలోపు, 32 హస్తాలకు అధికం వున్న గృహాలకు 'ఆయం' అవసరం లేదని 'వాస్తు చింతామణి' చెబుతోంది. హస్త ప్రమాణమంటే అరడుగు. అట్లా 8 అడుగులలోపు ఎట్లాంటి ఇళ్లుంటాయి? 32హస్తాలపైన గృహాలకు ఆయం ఎందుకవసరం లేదు? ఇది కూడా సమాధానాలు లేని ప్రశ్నలే!

'ముహూర్తమార్తాండంలో' నాల్గు దిశల్లోని వాస్తు పురుషుని నాలుగు ముఖాలకు ఆయాన్ని పాటించనవసరం లేదని రాశారు. పైగా పూరిగుడిసెలకు 'ఆయం' అవసరం లేదని ఖరాఖండిగా చెప్పారు.

నిర్దుష్టమైన పద్ధతులు అన్ని రకాల కట్టడాలకు ఒకే విధంగా వుండాలి. ఇన్ని భిన్న అభిప్రాయాలు కలిగిన 'ఆయం' ఏ విధంగా పాటించాలి? అనుసరించి, ఏ విధంగా గృహ నిర్మాణాలు ఎలా చేయాలో అర్థం కాదు.

### రాజుల కాలంనాటి బూజు!

ఆయం విధానాన్ని ప్రాచీన వాస్తు శాస్త్రాల్లో నిర్దుష్టంగా వెల్లడించినపుడు 'ఆయం'ను నిర్ధారించిన పండితులు, ధనవంతుల భవనాల్ని దృష్టిలో పెట్టుకొని ఈ విధానాన్ని 'సృష్టించారని' తెలుస్తుంది.

అందువల్లే నైరుతి 'నిరుతి' స్థానంలో ఆయుధాగారం, వాయువ్యంలో గజ, అశ్వశాలలు ఏర్పాటు చేయాలని శాస్త్రాల్లోచెప్పారు. తరాలు మారుతున్నా మారని సిద్ధాంతాల్ని పాటించడం వల్ల నవ్వులపాలు కావడం తప్ప మరేమీ వుండదు.

ఈ ఆధునిక యుగంలో నైరుతిలో ఏ ఆయుధాల్ని తెచ్చి దాచుకోవాలి? అందువల్లే అనుభవానికి అందని అంశాల్ని, గృహ సౌకర్యాలకు సంబంధం లేని సూచనలను తిరస్కరించవలసి వున్నది.

ఈ అంశాలు వాస్తు శాస్త్రాల్లో ఆయా కాలమానాలకు అనుగుణంగా మలచడమే తప్ప తరాలపై రుద్దమని చెప్పలేదు. మానవ బలహీనతలను 'క్యాష్' చేసుకోడానికి ఇటువంటి 'తలమాసిన' అంశాలను దివ్యాస్త్రాలుగా చేతబట్టి ప్రజల్ని పీడిస్తున్నారు కొందరు. ఇది చాలా శోచనీయమైన విషయం.

అందువల్ల కాలంతోపాటు శాస్త్ర పద్ధతుల్ని, నిర్ధారణలను మార్చవలసిన బాధ్యత మేధావులైన శాస్త్రజ్ఞులపై వుంది. ఏ రంగానికి చెందినవారు ఆ రంగంలోని చెడు 'నిషిద్ధం' చేయాలి. ఆధునిక కాలంతోపాటు శాస్త్రాన్ని, శాస్త్రంలోని 'తికమకల్ని' ప్రజలు ప్రశ్నించి సంతృప్తికరమైన అంశాల్ని మాత్రమే గ్రహించాలి. ఈ మార్పు ఎంత త్వరగా వస్తే దేశం అంత త్వరగా బాగుపడుతుంది. *

మహాభారతోపన్యాసాలలో భాగంగా విరాటపర్వంపై మాట్లాడిన మోపూరు వేణుగోపాలయ్యను సన్మానిస్తున్న తె. బ్రహ్మయ్య చిత్రంలో ఎడమ నుంచి కుడికి శ్రవణ్‌కుమార్, వెంకురెడ్డి, రామసుబ్బారెడ్డి, పి.వి. రమణారెడ్డి, బి. రామిరెడ్డి

**సీనియర్ సివిల్ జడ్జి కోర్టు, కోవూరు**

I.A.No. 57/2000

A.S. No. 5/97

బిట్టమూరు చినశేషయ్య - పిటీషనరు/ అపెలెంటు

Vs.

బీద కృష్ణవేణమ్మ, వగైరాలు - రెస్పాండెంట్లు

వార్సు పిటీషను మీద నోటీసు

TO : (1) బీద కృష్ణవేణమ్మ, w/o వెంకట సుబ్బయ్య (2) బీద భాస్కరరావు, s/o వెంకటసుబ్బయ్య, (4) బీద రవి, s/o వెంకట సుబ్బయ్య, (5) గొల్లప్రోలు చంద్రవదనమ్మ w/o సుబ్రహ్మణ్యం, (6) C.K. సుజాతమ్మ, w/o పురుషోత్తం, (7) కాటూరి సులోచనమ్మ, w/o మనోహర్, (8) P. జయలక్ష్మి, w/o రాజశేఖర్;

1,2,4,5 అసాములు సాకీన్ కోవూరు (మండలం), నెల్లూరు జిల్లా, 6వ రెస్పాండెంటు సాకీన్ చిత్తూరు, 7వ రెస్పాండెంటు సాకీన్ గుంటూరు, 8వ రెస్పాండెంటు సాకీన్ బెంగుళూరు.

పై నంబరు అపీలు A.S. 5/97 నంబరున యీ నంబరు పిటీషన్‌లో బీద వెంకట సుబ్బయ్య మీద చేయగా అపీలు మధ్య కాలంలో బీద వెంకటసుబ్బయ్య చనిపోయిన సందున అతని వారసులను అపీలులో పార్టీగా చేర్చుటకు పై పిటీషను దాఖలు చేయగా మీకు నోటీసు నిమిత్తం 21.12.2000 తేదికి వాయిదా వేసి వున్నారు. ఆ రోజున మీరు ఉదయం 10.30 గంటలకు పై కోర్టులో హాజరై మీ ఆక్షేపణలు తెలుపుకొనేది, లేని యెడల పై పిటీషను మీ పరోక్షమున తీర్మానించబడును.

ఉదాలి సుబ్రహ్మణ్యం

పిటీషనరు వకీలు, కోవూరు

## పెండింగ్ కేసులు

5వ పేజీ కొరవ

పేకాట ఆడేవారిపై, వ్యభిచారం జరిపే గుడిసెలపైకి మాత్రం వెళ్లి సరిపెట్టుకొంటున్నారు. కొత్త ఎస్పీ శ్రీనివాసరెడ్డి చురుకుదనం గల వ్యక్తి అవడం వల్ల ఈ కేసుల పరిష్కారానికి ఒక ప్రత్యేక పోలీసు బృందాన్ని నియమిస్తే బాగుంటుంది. కేసులు పరిష్కారమైతే ఆయన ప్రతిష్ఠ పెరుగుతుంది.

## డి.ఇ.ఓ. ఆఫీసు

5వ పేజీ కొరవ

ఫుల్ అడిషనల్ ఛార్జిగల పోస్టుల్లో పనిచేసే సీనియర్ టియిడిల పోస్టుల్లో బదలీల వ్యవహారం గుంటూరులోని ఆర్‌జెడి జరపాలి. వాస్తవంగా గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల పరిధి ప్రాతిపదికలో ఇవిచేయాలి. కాని డిఇఓ, డిప్యూటీ డిఇఓ 1985 తర్వాత హైస్కూల్స్ అయిన వాటిలోని ఖాళీల వివరాలు అక్కడకు పంపక ఇక్కడే తన వర్గీయులతో నింపుకొంటున్నారు. ఉపాధ్యాయ సంఘాల నాయకులకు కొన్ని పోస్టులు పంచిపెట్టడం వల్ల వాళ్లు ఈ వ్యవహారాన్ని చూసి చూడనట్లు వదిలేస్తున్నట్లు విమర్శలొస్తున్నాయి. డిప్యూటీ డి.ఇ.ఓ రామలింగం తన వర్గీయురాలికి సెకండరీ గ్రేడ్ విద్యార్హతలున్నా, కొత్తూరు హైస్కూల్ హెడ్మాస్టర్‌గా నియమించి, ఆమెకు సహాయం చేసేందుకు యల్లాయపాళెం నుంచి తన కోటరీలో ముఖ్యుడైన తెలుగు పండిట్‌ను నిబంధనలకు విరుద్ధంగా నియమించినట్లు తెలిసింది. డిఇఓ ఆఫీసులో తన కులపు వాళ్లను నియమించుకొను హైదరాబాద్ స్థాయిలో డిఇఓ కసరత్తు మొదలెట్టగా, డిప్యూటీ డిఇఓ బిసి కార్డుతో తన పనులు తాను చేసుకపోతున్నారు. తాను పాఠశాలల విద్యామంత్రి కడియం శ్రీహరికి ఆత్మీయుడిని కాబట్టే గతంలో డిఇఓగా పనిచేసిన ప్రభాకర్ రెడ్డితో సవాల్ చేసి ఆయన పోస్టులో ఇక్కడకు రాగలిగినట్లు డిఇఓ జయచంద్రకుమార్ చెబుతున్నారు. డిఇఓ ఆఫీసులో కులఘర్షణలు, అవినీతి పెచ్చు పెరగక మునుపే రాష్ట్ర స్థాయి ఉన్నతాధికారులు తగిన చర్యలు తీసుకోవాల్సి వుంది.

## ప్రభుత్వ ఉత్తర్వును తొక్కిపారేసిన ఎంఇఓ

ప్రభుత్వ ఉత్తర్వులను తూ.చ. తప్పకుండా అమలు చేయాల్సిన విద్యాధికారి ఒక పార్టీకి తొత్తుగా మారి ఉత్తర్వును పూర్తిగా తొక్కిపెట్టేశారు. సంగం మండలం జంగాల దరువు విద్యా కమిటీ ఎన్నికను నిలుపు చేస్తూ పాఠశాలల విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరి స్టేను మంజూరు చేశారు. కాని సంగం ఎం.ఇ.ఓ ఈ స్టేను తొక్కిపారేసి ఈ ఎన్నిక సజావుగా జరిగిపోయేటట్లు చేశారు. ఈ పని ముగిసాక అసలు వ్యవహారాన్ని బయలు పెట్టారు. టిజెపి నాయకుల అండదండలు వుండబట్టే ఎంఇఓ ఈ పని చేశారని చెబుతున్నారు. ఎంఇఓకు రాజకీయాలు ఎందుకబ్బా? డిఇఓగారు ఈ విషయాన్ని పరిశీలించండి.

## ప్రశాంతంగా విద్యాకమిటీ ఎన్నికలు

బుచ్చిరెడ్డిపాళెం మండలంలో ఇటీవల జరిగిన విద్యాకమిటీ ఎన్నికలు ప్రశాంతంగా జరిగాయి. మండలంలో మొత్తం 76 పాఠశాలలకు గాను 71 పాఠశాలలకు విద్యాకమిటీ ఎన్నికలు జరిగాయి. వీటిలో ఎక్కువ శాతం ఏకగ్రీవంగా జరగడం విశేషం. వీటిలో ఆరు ఉన్నత పాఠశాలలు, ఒక్క ఎయిడెడ్ స్కూలు ఉన్నాయి. 5 ఎయిడెడ్ పాఠశాలలకు మాత్రం కోర్టు స్టే కారణంగా ఎన్నికలు జరగలేదు. ప్రతిష్ఠాత్మకమైన బుచ్చిరెడ్డిపాళెం యస్.కె.ఆర్.ఎస్. అండ్ డి.ఎల్.ఎన్.ఆర్ పాఠశాల ఛైర్మన్‌గా మారెళ్ల సుధాకర్ తిరిగి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అదేవిధంగా రేబాల విద్యాకమిటీ ఛైర్మన్‌గా పి.విజయబాబు, అరుంధతీయ ప్రాథమికోన్నత పాఠశాల ఛైర్మన్‌గా దర్శిగుంట లక్ష్మిదేవి, బుచ్చి బాలికల పాఠశాలకు సుజాతమ్మ, డి.పి.ఎం. పాఠశాలకు కోళ్ల శ్రీనివాసులు ఎన్నికయ్యారు.

## రజకుల సమస్యలను పరిష్కరించాలి

రాష్ట్ర జనాభాలో 50లక్షల జన సంఖ్య గల రజకుల సమస్యలను తక్షణం పరిష్కరించాలని ఆంధ్రప్రదేశ్ రజక సంఘాల ఐక్య కార్యాచరణ సమితి ప్రధాన కార్యదర్శి ఉదయగిరి బ్రహ్మయ్య కోరారు. రజకుల సమస్యల మీద అన్ని జిల్లా కేంద్రాలలో ఈ నెల 18తేది జరగనున్న ధర్నా కార్యక్రమాలను చర్చించేందుకు బుధవారం ఆయన బుచ్చికి వచ్చారు. ఈ సందర్భంగా ఆయన విలేఖరులతో మాట్లాడుతూ ఈ నెల 18న జరిగే ధర్నాలో రజకులను ఎస్‌సిలో చేర్చాలనేది తమ ప్రథమ డిమాండ్ అని చెప్పారు. 1978 ఏప్రిల్ 10న విడుదల అయిన జి.ఓ. ప్రకారం రజకులకు అందవలసిన ఉద్యోగాలను ఇప్పటికీ యివ్వకపోవడం పట్ల విచారం వ్యక్తం చేశారు. దేశంలో 16 రాష్ట్రాలలో రజకులు ఎస్‌సిలుగా గుర్తించారని, మిగిలిన రాష్ట్రాలలోను, మన జిల్లాలో రజకులను బిసిలుగా గుర్తించడం పట్ల ఆయన ప్రభుత్వ వైఖరిని దుయ్యబట్టారు. కార్యక్రమంలో ఆయన వెంట రజక నాయకులు పెనుబల్లి కృష్ణయ్య ఎన్.వెంకటేశ్వర్లు, వింజమూరు వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# శ్రీహరి తప్పటడుగులు వేస్తున్నాడా!

చిరంజీవి హీరోగా "మృగరాజు" సినిమా తీస్తున్న దేవివరప్రసాద్ తీస్తే చిరంజీవితోనే చేస్తాడు; లేకుంటే ఖాళీగా కూర్చుంటారు. చిరంజీవి రెగ్యులర్ ప్రొడ్యూసర్స్ విజయబాపినీడు, అశ్వినీదత్ తదితరులు చిరంజీవితో సినిమా లేనప్పుడు, ఇతర హీరోలతో సినిమాలు తీస్తుంటారు. ఇదే విషయాన్ని ప్రస్తావించి, ఓ పర్యాయం హీరో చిరంజీవి

## పర్మినెంట్ బ్యానర్స్ ఏవీ?

"మీరు వీరివలెనే ఏదో ఒక సినిమా తీస్తే ఆ వైపు ఫీడింగ్ వుంటుంది గదా" అనడిగారు. దానికి దేవి వరప్రసాద్ ఇచ్చిన సమాధానం: "సినిమా లేనప్పుడు నా మెయిన్‌టెనెన్స్‌కి ఆఫీసుకి నెలకు నలభై - ఏభై వేలవుతుంది. అంటే సంవత్సరానికి అయిదారు లక్షలు. రెండు లేదా మూడు సంవత్సరాలకు మీతో సినిమా - ఈ గేప్‌లో ఓ పదిహేను లక్షలు ఖర్చు. అదే చిన్న సినిమా తీశామనుకోండి. మీతో తీయబోయే సినిమాని చూసి ఫైనాన్సియర్స్ వస్తారు - బయ్యర్స్ వస్తారు. అంటే మీ పేరు చెప్పి ఈ చిన్న సినిమాల బిజినెస్ చేయాలి. ఆ సినిమాలు సరిగా ఆడలేదనుకోండి - మీతో తీసే సినిమాలను బయ్యర్స్‌కి తగ్గించి ఇవ్వాలి. ఒక చిన్న సినిమా పోతే చాలు నలభై యాభై లక్షలు నష్టం - బయ్యర్స్‌కి గాని నాకుగాని. కొన్ని సందర్భాలలో ప్రింట్ పబ్లిసిటీ కాస్ట్ రాదు. ఎందుకొచ్చిన గొడవ - నాకా ఒక్కగానొక్క కూతురు. రెండేళ్లకో, మూడేళ్లకో మీతో ఓ సినిమా తీస్తే కోటి రూపాయలు మిగుల్తాయి.

తరువాయి 11వ పేజీలో

# 25 కోట్లతో హిందీ "దేవదాస్"

దేవదాస్‌గా షారుఖ్‌ఖాన్, పార్వతిగా ఐశ్వర్య, చంద్రముఖిగా మాధురి దీక్షిత్.

సైగల్, దిలీప్‌కుమార్‌లతో హిందీలో రెండు పర్యాయాలు; అక్కినేని నాగేశ్వరరావు, హీరో కృష్ణలతో తెలుగులో రెండు పర్యాయాలు నిర్మింపబడిన శరత్ "దేవదాసు" హిందీలో మళ్లీ పునర్నిర్మింపబడుతోంది. ముంబాయ్‌లోని ఫిలిం సిటీలో ఆర్ట్ డైరక్టర్ నితిష్ దేశాయ్ తన 100 మంది సిబ్బందిలో సినిమాకి కావలసిన సెట్స్‌ని - 1930నాటి వాతావరణాన్ని (బెంగాలీ) సజీవంగా నిలుపుతూ రూపొందిస్తున్నారు. ఈ సెట్స్ వ్యయం దాదాపుగా 11కోట్లు అవుతుందని అంచనా. ఇప్పటికే అయిదుకోట్లు ఖర్చు పెట్టడం జరిగింది. చిత్ర నిర్మాణ వ్యయం 25కోట్లు అవుతుందని అంచనా.

## హైదరాబాదు సినిమా వార్తలు

తెలుగు "దేవదాసు" అంతటి ఘనవిజయం సాధించడానికి ఒక్క నాగేశ్వరరావే కారణమనుకుంటే పొరపాటు. దర్శకుడు - ఛాయా గ్రాహకుడు - సంగీత దర్శకుడు - మాటల రచయిత - పాటల రచయితలు - నేపథ్యగాయనీ గాయకులు - పార్వతిగా సావిత్రి, దేవదాసు స్నేహితునిగా పేకేటి, ముసలి భర్తగా సిఎస్ఆర్ - అందరూ తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించారు. ఎవరి ప్రతిభా పాటవాలను ఎంతగా ఎలా వినియోగించుకోవాలో తెలిసిన దర్శకుడు వేదాంతం రాఘవయ్య కనుకనే. ఆ సినిమా చూసిన హిందీ దేవదాస్ దిలీప్ కుమార్ ఒక నమస్కారం పెట్టి తానిలా నటించలేనని చెప్పారు. ప్రసిద్ధ గాయకుడైన సైగల్ నటించిన దేవదాస్, బారువా నటించిన బెంగాలీ దేవదాస్ కూడా తెలుగు దేవదాస్ ముందు బలదూర్!

# హీరో కృష్ణ "లిటిల్ గ్యాంగ్"

తెలుగు సినీ పరిశ్రమలో నూతనాధ్యాయం ప్రారంభమయ్యింది - అదీ మిలీనియం సంవత్సరంలో! పెద్ద పెద్ద బ్యానర్లు - హీరోల చిత్రాలయినా సరే మొదటి రోజు - మొదటి ఆట - మొదటి వారంలో భవిష్యత్తు తేలిపోతుంది. సినిమా బాగా లేకుంటే అంతే సంగతులు! కథలో - కథనంలో - టెక్నికల్‌గా కొత్తగా చెప్పగలిగితే బాల ప్రేక్షకులు ఆదరిస్తున్నారు. 'చిన్నా పెద్ద - డబ్బింగ్' అన్న ప్రమేయం లేకుండా ఆఖరికి హిందీ, ఇంగ్లీషు డబ్బింగ్ చిత్రాలను కూడా ప్రేక్షకులు ఆదరిస్తున్నారు.

ఈ నేపథ్యంలో - వీధిలో విసిరివేయబడిన అనాథ బాలలు యాంటీసోషల్ ఎలిమెంట్స్‌గా ఏ విధంగా తయారవుతారో "కటకటాల రుద్రయ్య, బ్రహ్మపుత్రుడు, సామ్రాజ్యం, దళపతి", తదితర చిత్రాలలో చూపించారు. అయితే ఆ పాత్రలను గ్లామరైజ్ చేయడం వల్ల సమాజానికి అందవలసిన సందేశం తగుమోతాదులో అందలేదు. ఎన్‌ఎఫ్‌డిసి ఆర్థిక సహాయంతో గతంలో ఓల్గా - కుటుంబరావు ఓ చిత్రం తీశారు. అయితే ఆ చిత్రం ఫిలింఫెస్టివల్స్‌కే పరిమితమయ్యింది. ఇప్పుడు "బాల కార్మిక వ్యవస్థ" నేపథ్యంగా తీసుకొని "లిటిల్ గ్యాంగ్" పేరుతో ఓ చిత్రాన్ని ప్రారంభించారు. సూపర్‌స్టార్ కృష్ణ ఈ చిత్రంలో ఓ ముఖ్యపాత్ర పోషిస్తున్నారు.

లిటిల్ గ్యాంగ్‌లో మీ రోల్ ఏమిటి? అన్న ప్రశ్నకు హీరో కృష్ణ ఈ విధంగా సమాధానమిచ్చారు. వారి జీవితాలకు భద్రత, భవిష్యత్తు కల్పించడానికి పోరాడే పాత్రనాది. రిటైర్డ్ మిలట్రీ మేజర్ పాత్ర పోషిస్తున్నాను.

సూపర్‌స్టార్ కృష్ణతో పాటు మరో అగ్రనటి నటించనున్న ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం జి.వి.అంజిరెడ్డి. నిర్మాత చిట్టి నాగేశ్వరరావు.



"మా ఆవిడ మీదొట్టు మీ ఆవిడ చాలా మంచిది" చిత్రంలో వడ్డే నవీన్, రాశి.

# 'శుభవేళ'లో అన్నీ అశుభాలే

## చిత్రసమీక్ష

* * *

గ్రిద్దలూరు గోపాలరావు

సత్యభామ (అనసూయ) ప్రాణస్నేహితురాలు పెళ్లయిన కొద్ది రోజుల్లోనే ఆత్మహత్యకు ప్రయత్నించి హాస్పిటల్ పాలవుతుంది. సత్యభామ ఆమెను చూసేందుకు పోతుంది. ఆమె దీన గాథవింటుంది. పెళ్లయిన తర్వాత తాను ఒక్కరోజు కూడా ఆనందంగా లేనని, అత్తవారింట కుటుంబ సభ్యులతో నరకమనుభవించానని, కష్టాలు భరించలేక ఆత్మహత్య ప్రయత్నం చేసుకున్నానని, పెళ్లయిన తర్వాత మొగుళ్ల రూపమెత్తిన మగాళ్లు రాక్షసుల్లా మారుతారని చెప్పి, నువ్వు పెళ్లి చేసుకోవద్దని నాలాగా బాధలకు గురికావద్దని కూడా చెప్తుంది. ఆమె ఆవేదన విన్న సత్యభామలో మగాళ్ల మీద ద్వేషభావం ఏర్పడుతుంది. పెళ్లిమీద ఏవగింపు ఏర్పడుతుంది.

సత్యభామ తండ్రి (గిరిబాబు) ఆమెకు పెళ్లి నిశ్చయిస్తాడు. పెళ్లి పీటల మీద కూర్చొనివున్న సత్యభామ పెళ్లికొడుకు తాళికట్టబోయే సమయంలో పట్టరాని కోపంతో తాళిబొట్టు లాగి విసిరికొట్టి పెళ్లికొడుకు గుండెల మీద కాలితో తన్ని, అక్కడ నిలిపివున్న ఎవరిదో స్కూటర్ ఎక్కి పారిపోతుంది. ఆ తర్వాత మరో రెండు పెళ్లిళ్లలో కూడా సత్యభామ అదే విధంగా ప్రవర్తిస్తుంది.

జర్నలిస్టుగా పనిచేస్తున్న సూర్యతేజ (రవికాంత్) సత్యభామ విచిత్ర పెళ్లి ప్రహసనాన్ని తన పత్రికలో సీరియల్‌గా ప్రచురిస్తాడు. ఆ అవమానం భరించలేక సత్యభామ, సూర్యతేజ మీద కోర్టులో పరువు నష్టం కేసు వేస్తుంది. ఆ కేసును పరిష్కరించుకునేందుకు సత్యభామను వెతుక్కుంటూ ఆమె ఊరు వస్తాడు సూర్యతేజ. తొలిచూపులోనే ఆమెను ప్రేమిస్తాడు. సత్యభామ పెళ్లి సూర్యతేజతో నిశ్చయమవుతుంది. అతన్ని పెళ్లి పీటల మీద తన్ని పారిపోతున్నప్పుడు ఒకనాడు భర్తను ఏవగించుకొని ఆత్మహత్యకు పూనుకున్న తన ప్రాణస్నేహితురాలు తన భర్తతో హాయిగా తిరగటం చూస్తుంది సత్యభామ. ఆమెను చూచి ఆశ్చర్యపోతున్న సత్యభామకు ఆమె నీతిబోధ చేస్తుంది. తనకు యుక్తవయసు రాకముందే, అత్తవారింటి వారిని అర్థం చేసుకునే బుద్ధి తనలో ఎదగకముందే తనకు పెళ్లి జరగటం వల్ల తన భర్తతో, ఆయన కుటుంబీకులతో అనుకూలంగా మెలగటం తెలియక విసిగి ఆత్మహత్యకు పూనుకున్నానని, ఇప్పుడు తనలో సంసారం చక్కగా చేసే పరిజ్ఞానం కలగటంతో తన భర్తతో హాయిగా సంసారం చేస్తున్నానని సత్యభామకు చెప్తుంది. ఈ పెళ్లి రహస్యం విన్న సత్యభామ తన తెలివి తక్కువ తనానికి చింతిస్తుంది. ఆ తర్వాత కను విప్పు పొందుతుంది. ఒక శుభవేళ సూర్యతేజ చేత తాళికట్టించుకుంటుంది. సుఖశాంతులతో సంసారం సాగిస్తుంది.

యుక్తవయసు వచ్చి, వ్యక్తిత్వం చేకూరి, ఎదుటి వారిని అర్థం చేసుకోగల పరిజ్ఞానం అబ్బిన తర్వాతనే అమ్మాయిలకు వివాహం చేస్తే వారి సంసారం సుఖమయవుతుందన్న సందేశాన్ని "శుభవేళ" చిత్రం అందిస్తుంది. చాలా చౌకబారు సందేశం.

గతంలో "చిత్రం" చిత్రానికి కథ వ్రాసిన తేజ ఈ చిత్రానికి కథ వ్రాశాడు.

తరువాయి 11వ పేజీలో

# వారఫలాలు

*16-12-2000తేది నుండి 22-12-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; వృశ్చికంలో 18తేది వరకు, పిదప ధనుస్సులో బుధ; ధనుస్సులో రవి, కేతువులు; మకరంలో శుక్రుడు; సింహ, కన్య, తులలలో చంద్రుడు.*

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

పనులు ఆటంకాలతో జరుగుతాయి. కొంతకాలంగా నిలబడిన తగాదాలు కేసులు పరిష్కారానికి వస్తాయి. ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. బంధువుల అనారోగ్యవార్తలు, వాహన రిపేర్లుంటాయి. వ్యాపార రంగాల వారికి అవకాశాలు చేజారవచ్చును. ఉద్యోగులు విధి నిర్వహణలో ఇబ్బందులు పడతారు. అధికారుల దయాదాక్షిణ్యాల కోసం, ఖర్చులు తప్పవు. విద్యాప్రగతి బాగుంటుంది. వారాంతంలో ఆరోగ్యం లోపించవచ్చును.

## వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆరోగ్యం కాపాడుకొనాలి. ఖర్చులు పెరిగిపోతాయి. అనవసర ఖర్చులుంటాయి. కుటుంబ సభ్యులకు అనారోగ్యం, రుణం చేయడం, ముఖ్యవ్యవహారాలలో ఆటంకాలు, సన్నిహితులైన వారితో విభేదాలు ఉంటాయి. కొత్త పరిచయాలు, వస్తు నష్టం జరుగవచ్చును. ఉద్యోగార్థులకు మంచి అవకాశాలు, రాజకీయ వర్గాలకు ఎదురుదెబ్బలు, బంధుమిత్రుల వల్ల పనులు జరగడంలో ఇబ్బందులు, కుటుంబ సౌఖ్యం ఉంటుంది.

## మిధునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆర్థికస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. గౌరవమర్యాదలు బాగుండి పనులు జరిగిపోతాయి. వ్యాపార వస్తుం దాలు, పెట్టుబడులపై నిర్ణయాలు జరగడం ఉంటుంది. కుటుంబ సభ్యులకు అనారోగ్య బాధలుంటాయి.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

సమస్యలు, ఆర్థిక ఇబ్బందులు క్రమంగా తొలగి ఆదాయం పెరుగుతుంది. పనులన్నింటిని విజయవంతంగా పూర్తి చేస్తారు. ఆరోగ్యం కొద్ది బాధపెడుతుంది. బంధువర్గ కష్టాలు, అనారోగ్య వార్తలు వింటారు. కొత్త పరిచయాలు కలుగుతాయి. వృత్తి, సాంకేతికపరమైన జీవనం గలవారికి విదేశీయానావకాశాలు, కొత్త ఉద్యోగాలు లభ్యంకాగలవు. విద్యాప్రగతి బాగుంటుంది. ఉద్యోగులకు విధి నిర్వహణలో ప్రశంసలుజరుగుతుంది.

## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

వ్యాపారపరంగా బాగా జరుగుతుంది. వృత్తి జీవనం కూడా ఆదాయం బాగా కలిగివుంటుంది. వ్యవసాయ, భూ సంబంధ రాబడి తగ్గవచ్చు. ఆందోళన కలిగించవచ్చు. కుటుంబ సభ్యులు, ఉద్యోగ సమస్యలు సానుకూలం అగును. గృహ, వాహన క్రయవిక్రయాలు జరుగగలవు. గుర్తింపు, గౌరవాలు బాగుండి పలుకుబడి పెరుగుతుంది. కుటుంబ స్త్రీలకు ఆరోగ్య లోపం ఉంటుంది. శుభకార్య ప్రయత్నాలు వెనుకబడగలవు. ఉద్యోగులకు, అధికారులతో సంబంధాలు బాగుంటాయి. సాంఘిక, కళా రంగాల వారికి సత్కారాలు జరుగవచ్చును. విద్యాప్రగతి బాగుంటుంది. ఇంటి ఖర్చులు పెరగడం, బంధువుల రాకపోకలు, చిన్న వస్తువుల లాభం ఉంటుంది.





## కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

ఆర్థికపరిస్థితి బాగుంటుంది. వ్యాపార పెట్టుబడులు జరుగుతాయి. రావలసిన బాకీలు, రుణాలలో కొంత ప్రగతి కనపడుతుంది. బంధువుల సహకారాన్ని కుటుంబ వ్యవహారాలలో పొందుతారు. ముఖ్యపనులు పూర్తి చేస్తారు. ఉద్యోగార్థులకు శ్రమ తప్పదు. విద్యాప్రగతి బాగుంటుంది. ఉద్యోగులకు విధి నిర్వహణలో కొద్ది ఆటంకాలుంటాయి, వారం మధ్యలో అనవసర ఖర్చులు, అనుకోని ప్రయాణాలు, బంధుమిత్రులకు సహాయపడటం జరుగుతుంది.

## పంచాంగం



తేది 17 ఆదివారం ధనుర్మాస ప్రారంభం. శూన్యమాసం కాదు.

### ముహూర్తాలు

తేది20 బుధవారం ఉదయం గంట 9.14లకు మకరలగ్నాన వివాహ, వ్యాపారాలకు సుముహూర్తాలున్నాయి.

### డిశంబరు తిథులు

మార్గశిర బహుళ



తేది 16శని షష్ఠి రా 2.05గం.వ
తేది 17ఆది సప్తమి రా12.00గం.వ
తేది18సోమ అష్టమి రా10.15గం.వ
తేది19మంగళ నవమి రా8.45గం.వ
తేది 20బుధ దశమి రా7.45 గం.వ
తేది 21బేస్త ఏకాదశి రా7.10 గం.వ
తేది 22శుక్ర ద్వాదశి రా7.00 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



## తుల

(చిత్త3,4పాదాలు,స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

పనులందు ఆందోళన, అతిగా ఆలోచనలుంటాయి. అయితే అనుకున్న పనులు సాఫీగా సాగుతాయి. ఆర్థికపరిస్థితి ఇబ్బందిగా ఉండినా అవసరాలకు డబ్బు అందుతుంది. బంధుమిత్రుల సహకారం పొందుతారు. రుణాలు చేస్తారు. విద్యార్థులు విద్యపట్ల నిర్లక్ష్యం చూపే ప్రమాదమున్నది. ఉద్యోగార్థులకు అవకాశాలు తక్కువ.



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

అనుకోని సంఘటనలు, ఖర్చులు ఏర్పడతాయి. మిత్రులతో విభేదాలు రావచ్చును. నిలబడిపోయిన పనులు మరలకొనసాగుతాయి. ఆర్థిక పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. బాకీలపై వత్తిడి పెరగవచ్చును. కుటుంబ సౌఖ్యం ఉంటుంది. విద్యార్థులకు అభివృద్ధి, ఖర్చులు చేయడం చేస్తారు. ఉద్యోగార్థులకు అవకాశాలు, విదేశీయానావకాశాలు రావచ్చును. రాజకీయ రంగాలలో వున్న వారికి పలుకుబడి పెరుగుతుంది.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

వ్యాపారస్తులు డబ్బు విషయంలో జాగ్రత్త పడాలి. ఆర్థిక లావాదేవీలలో చిక్కులు రావచ్చును. ముఖ్య బంధువుల అనారోగ్యవార్తలు, అధికార వర్గాలవల్ల చిక్కులు ఏర్పడవచ్చును. కుటుంబ సౌఖ్యం ఉంటుంది, బంధువులతో, సహచరులతో స్వల్ప విభేదాలు రావచ్చును. సాంకేతిక, వృత్తిపరమైన జీవనం వున్న వారికి ఆదాయం తృప్తికరంగా ఉంటుంది. స్వల్ప ప్రయాణాలు, చిరకాల వ్యక్తులతో కలయిక, వారాంతంలో శుభకార్య నిర్ణయవార్తలు వింటారు. విద్యాప్రగతి తగ్గుతుంది. ఆస్తి తగాదాలు, కోర్టు పనులు వాయిదా కోరితే మంచిది. రాజకీయ వర్గాలు జాగ్రత్తపడాలి.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

మీపై కొందరికి అసంతృప్తి ఉంటుంది. ఆలోచనలు ఆచరణలో తేడా ఉంటుంది. ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. వ్యాపార వర్గాలకు, పెట్టుబడి రంగాల వారికి గడ్డుకాలం. స్థిరాస్తుల క్రయవిక్రయాలు, బహుమతులు పొందడం జరుగుతుంది. బంధువుల అనారోగ్య, వియోగ వార్తలు వింటారు. మీ ఆరోగ్యం కూడా జాగ్రత్త. కుటుంబ సౌఖ్యం ఉంటుంది.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

కొన్ని తొందరపాటు నిర్ణయాలు జరిగి ఇబ్బంది పడతారు. కుటుంబ వ్యక్తులకు అనారోగ్యం రావచ్చును. అనుకున్న పనులకు అదనపు ఖర్చులు తప్పవు. ఆర్థికస్థితి సామాన్యంగా ఉండి, లావాదేవీలలో ఆటంకాలు రావచ్చును. విద్యాప్రగతి బాగుంటుంది. విధి నిర్వహణ బాధాకరంగా ఉంటుంది.



## మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకొనాలి. కుటుంబ సభ్యుల వల్ల అదనపు ఖర్చులుంటాయి. విధి నిర్వహణలో జాగ్రత్త పాటించి అధికారులతో సరుకొని పోతేమంచిది. క్రయవిక్రయ ప్రయత్నాలు జరుగవచ్చు. అనుకున్న పనులు అనుకూలంగా జరిగినా, అందుకై ఖర్చులు తప్పవు. విద్యాప్రగతి బాగుంటుంది.

# జనవాణి

3వ పేజీ కొరవ

స్వీకరించారో అప్పటి నుంచి మునిసిపాలిటీలో కలహాల కాపురం మొదలయ్యింది. మొదట మునిసిపల్ పాలనలో రమేష్‌రెడ్డి జోక్యం చేసుకొంటున్నాడని రచ్చ బయలు దేరింది. రమేష్‌రెడ్డి వాస్తవానికి అంత చెడ్డ మనిషికాదు. ఆయనలోని మంకు పట్టుదలే ఆయన్ను ఈ స్థితికి తెచ్చింది. సమయా సమయాలనుబట్టి నడుచుకోవాలి. పశ్చిమ బెంగాల్‌లో సిపి ఎంను ఓడించను తృణముల్ కాంగ్రెస్, బిజెపి, కాంగ్రెస్ ఒకటయ్యాయి. డిఎంకెకు సిద్ధాంతరీత్యా బిజెపి బద్ధ విరోధి అయిన ఇద్దరి మధ్య అవగాహన కుదిరింది. రాబోయే స్థానిక సంస్థల ఎన్నికల్లో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్, కమ్యూనిస్ట్ కలసి పోటీ చేయబోతున్నాయి. మునిసిపల్ రాజకీయాలు కూడా పై బాటన నడవాలి. ప్రజా సంక్షేమమే ధ్యేయంగా అన్ని పార్టీలు కలసి పనిచేసి మునిసిపాలిటీలో కలహాల కాపురాన్ని అంతమొందించాలి.

నెల్లూరు — వాస్తు రామచంద్ర





## విద్యాప్రమాణాల్లో రాజీపడకూడదు

రాష్ట్రంలో రెవిన్యూ డివిజన్‌లో సైతం రెండు ఇంజనీరింగ్ కాలేజీలను ప్రభుత్వం మంజూరు చేసిపారేసింది. ఇంజనీరింగ్ కాలేజీలు అన్ని నెలకొల్పినప్పటికీ, వీటికి సరిపడినంత మంది ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు అందుబాటులో లేరు. అందువల్ల నిన్న, మొన్న ఇంజనీరింగ్ డిగ్రీతో ద్వితీయ శ్రేణిలో పాసైన వారిని కూడా లెక్చరర్లుగా తీసుకొంటున్నట్లు వార్తలు వస్తున్నాయి. ఇంజనీరింగ్ కళాశాలలు నెలకొల్పడంతోనే కాకుండా వాటిని నాణ్యతా ప్రమాణాలకు అనుగుణ్యంగా నడపాలి. లేకుంటే ఆంధ్రలో ఇంజనీరింగ్ డిగ్రీలంటే విలువ లేకుండా పోతుంది.

నెల్లూరు — వి.మోహనకృష్ణారెడ్డి

## నైతిక విలువలకు విలువేది?

అయోధ్యలో బాబ్రీ మసీదు కూల్చివేతకు కుట్రపన్నారన్న అభియోగం ఎదుర్కొంటున్న కొందరు కేంద్రమంత్రులు రాజీనామా చేయాలని ప్రతిపక్షాలు పార్లమెంటును స్తంభింప జేశాయి. వాస్తవానికిది నైతిక విలువలకు సంబంధించిన సమస్య. ఆరోపణలు ఎదుర్కొంటున్న వారు ఆత్మసాక్షిగా, నైతిక విలువలకు కట్టుబడి రాజీనామా చేయాలి. నైతిక విలువలనేవి ఎవరికి వారు పాటించవలసినవి. నేరారోపణ జరిగిన వారంతా ప్రభుత్వ పదవులకు అనర్హులని చట్టాలు లేవు. అందువల్లే వాళ్లు పదవుల్లో కొనసాగగల్గుతున్నారు.

నెల్లూరు — కె.సుందరయ్య



## ఈ శిక్ష సరిపోదు

క్రికెట్ మ్యాచ్ ఫిక్సింగ్ నేరానికి పాల్పడ్డ భారతదేశ జట్టు మాజీ కెప్టెన్ అజారుద్దీన్, అజయ్‌శర్మలపై భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు క్రమశిక్షణా సంఘం జీవితకాలం క్రికెట్ ఆడకుండా బహిష్కరించింది. అజయ్ జడేజా, మనోజ్ ప్రభాకర్‌లను అయిదేళ్లపాటు ఆడకుండా చేశారు. మ్యాచ్ ఫిక్సింగ్ వ్యవహారాన్ని ఎంత చిన్న విషయంగా క్రికెట్ కంట్రోల్ బోర్డు పరిగణిస్తున్నదో ఈ నిర్ణయాన్ని బట్టి భావించవచ్చు. కోట్లాది రూపాయలు మ్యాచ్ ఫిక్సింగ్ ద్వారా అక్రమార్జనకు పాల్పడినవారు, దేశ ప్రజల నమ్మకాన్ని వమ్ముచేసిన వారిని కఠినంగా శిక్షించేందుకు న్యాయస్థానం ముందు నిలబెట్టాల్సి వుండగా, అటువంటి ప్రయత్నాలేవీ క్రికెట్ బోర్డు చేయకపోవడం దారుణం.



నెల్లూరు — షేక్ హసీనా



## రోడ్లను శుభ్రపరచండి

నెల్లూరు, గూడూరు, కావలి పట్టణాలలో రోడ్లపై దురాక్రమణలు ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి చొరవతో తొలగించారు. సంతోషం. కాని ఆక్రమణల తొలగింపులో పడగొట్టిన భవనాల తాలూకు చెత్తాచెదారాన్ని తక్షణం అక్కడ నుంచి తొలగించే ఏర్పాటు చేయాలి. ఆక్రమణలు తొలగించిన రోడ్డు శుభ్రపర్చే పనిని ఆర్అండ్‌బి, మునిసిపాలిటీ చేపడితే బాగుంటుంది.

కుల్లూరు — సాధు కృష్ణప్రసాద్



## ఆర్థిక నిపుణుల సూచనలు పాటించండి

ఆంధ్రప్రదేశ్ రుణాల ఊబిలో కూరుకు పోతున్నదని ఇటీవల కొంత కాలంగా ఆర్థిక నిపుణులు గగ్గోలు పెడుతున్నారు. కాని ఆర్థిక మంత్రి యనమల రామకృష్ణుడు మాత్రం చేస్తున్న అప్పుల్లో ఎక్కువ భాగం మౌలిక సదుపాయాలు కల్పించడానికే ఖర్చు చేస్తున్నాం. వీటి ఫలితాలు త్వరలోనే అందుబాటులోకి వస్తున్నాయంటున్నారు. ఎక్కడెక్కడి నుంచి అప్పులు తెచ్చినప్పటికీ వ్యవసాయ రంగం అభివృద్ధికి గట్టి కృషి జరగడం లేదని ఆర్థిక నిపుణులు అంటున్నారు. కాబట్టి ఈ అంశాలన్నింటిపై నిపుణులతో చర్చించి మెరుగైన చర్యలు తీసుకోవాలి.

నెల్లూరు — ఎన్.వి. సురేంద్ర



# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

'అసమర్థుని జీవయాత్ర' వంటిది అయినదేమోనని పిస్తున్నది. 'అట్లీ - ట్రూమన్' సంప్రదింపుల సారాంశంగా ప్రకటింపబడిన 'పది హంశాల'లోనూ శాంతి బీజాల కంటే, సమరయత్నాలే ఎక్కువగా కనపడుతున్నాయి.

**రాష్ట్రకాంగ్రెస్ ఎన్నికలు వాయిదా**

పెళ్ళివ్వరుడి పెళ్లికి వెయ్యి విఘ్నాలు అంటారు. రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికలు మాత్రం అందుకేం తీసిపోలేదని పిస్తుంది. మళ్లీ రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికలను నిలుపుదల చేస్తూ ఉత్తర్వులొచ్చాయి. పంచాయతీ దార్లే రాష్ట్ర కాంగ్రెస్, తదితర కాంగ్రెస్ సంఘాల సభ్యులను ఎన్నుకొనే ఓటర్లనే సూత్రం 'జమీన్‌రైతు' పాఠకులకు తెలిసిన విషయమే.







## నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

8వతేది నేలనూతల శ్రీనివాసమూర్తి అరణ్యపర్వంపై మాట్లాడుతూ శ్రీకృష్ణుడు సత్యభామతో పాండవులను కలియడం, అజగరో పాఖ్యానం, ధర్మవ్యాధుని చరిత్ర, యక్షప్రశ్నల గూర్చి వివరించారు. 9వతేది మోపూరు వేణుగోపాలయ్య విరాట పర్వంపై కొత్తపేయంగా, హృద్యంగా ఉపన్యసించారు. తిక్కన తెలుగు భారతాన్ని రచించకపోతే ఆంధ్ర సాహిత్యపు తీరు తెన్నులు మరోలా వుండేవన్నారు. కీచకవధ, దక్షిణం, ఉత్తర గోగ్రహణ కథలను విశ్లేషించి వివరించారు. 10వతేది గాదిరాజు సుబ్రహ్మణ్యం, ఉద్యోగపర్వం లోని రసమయ ఘట్టాలైన ద్రుపద, సంజయ, శ్రీకృష్ణరాయబారాలను గూర్చి ముచ్చటిస్తూ రానున్న కురుక్షేత్ర సంగ్రామానికి ఆపర్వంలో ఎట్లా బీజావాపనం జరిగిందో స్థూలంగా వివరించారు. 11వతేది భీష్మపర్వము గూర్చి మెట్టు రామచంద్రప్రసాద్ మాట్లాడుతూ కురుక్షేత్ర సంగ్రామానికి ప్రారంభ వేదిక భీష్మపర్వమని, పేర్కొంటూ భారతం అది పంచకం కారణమైతే, యుద్ధ పంచకం కార్యం; తర్వాత పర్వాలు ఫలితం అంటూ భీష్మ పర్వంలో పాండవులు, కౌరవులు పన్నిన వ్యూహాల గూర్చి వివరిస్తూ ద్రోణాచార్యులు సర్వసైనాధిపత్యము వహించి అయిదు రోజులు కావించిన యుద్ధపు తీరును, అర్జునుడు పోరిన విధానాన్ని, పద్మవ్యూహం, అభిమన్యువధ, సైంధవ, ఘటోత్కచ సంహారము, ద్రోణవధను పరమాద్భుతంగా విశ్లేషించారు.

వక్తలు, సభాపోషకులను సమాజ ధ్యక్షులు జగ్గన్నరెడ్డి వెంకురెడ్డి పరిచయం చేశారు. చివరన రామసుబ్బారెడ్డి, శ్రావణ్ కుమార్, రామిరెడ్డి వందన సమర్పణ చేశారు. ఈ ఉపన్యాసాలు విశేషంగా ఆకర్షిస్తున్నాయనేందుకు సాక్ష్యం ఈ సభలకు తరలివచ్చే సాహితీ ప్రియులే ననాలి.

### అన్ని వసతులు సమకూరిస్తేనే ఆపరేషన్లు

ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఆపరేషన్లు చేసేందుకు సకల సౌకర్యాలు కల్పిస్తే తప్ప కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయలేమని ఎ.పి. ప్రభుత్వ డాక్టర్ల సంఘం నెల్లూరు శాఖ ప్రకటించింది. 12వతేది జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికార్యాలయంలో జిల్లా ప్రభుత్వ డాక్టర్ల సంఘం అధ్యక్షుడు రామసుబ్బారెడ్డి నేతృత్వంలో జరిగిన సర్వ సభ్య సమావేశంలో ఈ మేరకు నిర్ణయం తీసుకున్నారు. గుంటూరు, రంగారెడ్డి, నల్గొండ జిల్లాల్లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు వికటించిన కేసుల్లో వైద్యాధికారులపై ప్రైవేటు పోలీసు కేసులు నమోదు చేయడం, జైలు శిక్షలు విధించడం పట్ల డాక్టర్ల సంఘం ఆందోళన వ్యక్తం చేసింది. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించాలని గుర్తించిన ఆసుపత్రుల్లో ప్రాణ రక్షణ మందులు, స్టాఫ్ నర్సులు, మత్తు డాక్టర్‌తోపాటు, నిరంతర విద్యుత్ సౌకర్యం, ఆపరేషన్ చేసే మహిళలకు ముందు మహిళా డాక్టర్ అన్ని వైద్య పరీక్షలు నిర్వహించాలని డాక్టర్ల సంఘం కోరుతుంది. సౌకర్యాలు కల్పించకుండానే ప్రభుత్వాధికారులు ఆపరేషన్ల టార్గెట్లు ప్రకటించడం పట్ల ఆందోళన వ్యక్తం చేసింది. అన్ని సౌకర్యాలు కల్పించే వరకు ప్రస్తుతం నెలకొని వున్న వాతావరణంలో ఆపరేషన్లు చేయకూడదని సంఘం నిర్ణయించిందని జిల్లా కార్యదర్శి డాక్టర్ ఇ.సుధాకర్ తెల్పిచెప్పారు.

### ఆర్‌అండ్‌బిఅధికారులను దారికితెచ్చిన ఎమ్మెల్యే

నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 13వతేది దర్గామిట్టలోని ఆర్ అండ్‌బి కార్యాలయాన్ని సందర్శించి అక్కడి అధికారులను గడగడ లాడించారు. దీనికి కారణం ఎమ్మెల్యే దృష్టికి ఒక సమస్య రావడమేనవాలి. కలిగిరి మండలం గుడ్లదిన్న గ్రామం రైతు డి.వెంకారెడ్డి పొలంలోని మోటారును ఆర్‌అండ్‌బి ఇంజనీర్లు భూమిలోకి త్రొక్కించివేసి, ఇసుక రాళ్లతో కప్పేశారట. పంటచేతికొచ్చే సమయంలో అధికారులు ఈ పని చేయడాన్ని రైతు ఎమ్మెల్యే దృష్టికి తీసుకొచ్చాడు. గ్రామంలో వెంకారెడ్డి మోటారునే ఎటువంటి నోటీసు ఇవ్వక తొలగించడానికి కారణమేమిటని ఎమ్మెల్యే నిలదీసేసరికి ఆర్‌అండ్‌బి అధికారుల వద్ద సమాధానం లేదు. సాయంత్రం లోపల భూమిలో పాతిపెట్టిన మోటారును బయటకుతీసి నీరు పారిస్తామని చెప్పి ఆర్‌అండ్‌బి ఎస్‌ఇ ఎమ్మెల్యేకు క్షమాపణ చెప్పడంతో వివేకానందరెడ్డి అక్కడ నుంచి తిరిగొచ్చారు. దారినపోతూ రైతుల సమస్యలు పరిష్కరించే ఎమ్మెల్యేలు ఎవరుంటారు?

### చీటీల పేరిట మోసం

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా టౌన్ బ్రాంచిలో సీనియర్ అసిస్టెంట్‌గా పనిచేసే పెంచలయ్య 'కామందు చిట్స్' పేరిట పొదలకూరు రోడ్డులో చిట్స్ కంపెనీ ప్రారంభించారట. లక్షల రూపాయల్లో చిట్స్ నడిపి, పలువురికి డబ్బులు ఇవ్వకుండా ఇబ్బంది పెడుతున్నట్లు బాధితులు లబోదిబోమంటున్నారు. బ్యాంక్ వుద్యోగులే ఇలా చేస్తే ఎలా?

## క్షయ ఆస్పత్రి

4వ పేజీ కొరవ

ప్రస్తుతం లేవు. ప్రస్తుతం 160 మంది ఇన్‌పేషంట్లున్న ఈ ఆసుపత్రిలో పరమ నాసి రకం భోజనం పెడుతున్నారు. గతిలేని వారే ఈ ఆసుపత్రికి వస్తుండడంతో ఇటీవల మరణించిన ఇద్దరి వ్యక్తుల శవాలను ఖననం చేయిస్తామని వారి బంధువుల చేత ప్రత్యేక పత్రంపై సంతకం పెట్టించుకొని మెడికల్ కాలేజీకి ఇక్కడి డాక్టర్లు అమ్ముకొన్నట్లు తెలిసింది.

తన బంగళా ముందుండే ఈ ఆసుపత్రిని తనిఖీ చేసే తీరిక కలెక్టర్‌కు దొరికినట్లు లేదు. మరి ఈ క్షయ ఆసుపత్రిలోని రోగుల గోడు ఎవరికి పడుతుందబ్బా?

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

స్క్రీన్‌ప్లే వెలగబెట్టారు. ఛాయగ్రహణం చేపట్టాడు. కథ, కథనం, స్క్రీన్‌ప్లే, ఛాయాగ్రహణం, పాత్రలను మలచిన తీరు అధ్వాన్నంగా వుంది. దర్శకుడు రమణ ఏ సన్నివేశంలోను పట్టుబిగించలేక పోయాడు. దశరథ్ మాటల్లో పసలేదు. పాటలూ డిటో.

రవికాంత్, అనసూయలను కొత్త ముఖాలుగా హీరో, హీరోయిన్ పాత్రల్లో పరిచయం చేయబడింది. కాని వారిలోని నటనా ప్రతిభను రాబట్టబడలేదు. రామోజీరావుకు ఈ చిత్రం శుభం కల్గించలేదు.

## డిపిఓ లంచాలు

4వ పేజీ కొరవ

నిధుల డ్రాయింగ్ పవర్‌ను పంచాయతీ సర్పంచ్, కార్యనిర్వహణాధికారుల కిచ్చారు. నాన్ నోటి ఫైడ్ పంచాయతీల్లో సర్పంచ్‌ల తోపాటు డబ్బులు డ్రా చేసే అధికారాన్ని 16మంది విస్తరణాధికారులకు కట్టబెట్టారు. విస్తరణాధికారులు ఏదో విధంగా పంచాయతీల డబ్బులు తింటారు. కాబట్టి ఒక్కొక్కరి వద్ద నుంచి 5వేల రూపాయల చొప్పున ఈ బాధ్యతలు అప్పజెప్పే ముందు జిల్లా పంచాయతీ అధికారి దండించినట్లు తెలిసింది. నవంబర్ 21వతేది జిల్లా పంచాయతీ అధికారుల సమావేశానికి విధిగా శానిటరీ ఇన్స్‌పెక్టర్లు హాజరుకావాలని టెలిగ్రాము లిచ్చారు. ఆహారకల్తీ నిరోధక చట్టం అమలులోవున్న కోవూరు, నాయుడుపేట, సూళ్లూరుపేట, వెంకటగిరి శానిటరీ ఇన్స్‌పెక్టర్లు ఒక్కొక్కరు నెలకు 6,500 రూపాయలు తెచ్చివ్వాలని డిపిఒ హుకుం జారీ చేశారట. దీనివల్ల శానిటరీ ఇన్స్‌పెక్టర్లు వ్యాపారస్తుల మీద పడి లంచాలడుగుతున్నారు. పంచాయతీలకు విద్యుత్ పరికరాలు సరఫరా చేసే నెల్లూరులోని సింహపురి, బాలు, ఫ్యాన్సీ, సందీప్ ఏజన్సీల యజమానులను పిలిచి నాసిరకం సరకు లిస్తున్నారని వారి టెండర్లు రద్దు చేస్తామని బెదరించి, ఒక్కొక్కరితో 35వేల కమీషన్ ఇచ్చే విధంగా బేరం కుదుర్చుకున్నారట. గ్రామ పంచాయతీలోని బిల్ కలెక్టర్ల ట్రాన్స్‌ఫర్ చేస్తామని, పార్ట్‌టైం స్వీపర్లు, బిల్‌కలెక్టర్ల పోస్టులు శాంక్షన్ చేయను భారీ మొత్తంలో ముడుపులు కూడా వసూలు చేస్తున్నారట. ముడుపులన్నింటిని కార్యాలయంలోని సీనియర్ అసిస్టెంట్‌కు చెల్లిస్తే ఆయన డిపిఒ ద్వారా పనులు చకచకా చేయిస్తున్నారు. జిల్లా పంచాయతీ అధికారి కార్యాలయానికే రాకుండా ఇంట్లోనే వుండి ఫోన్ల ద్వారా పరిపాలన సాగిస్తున్నారు. జిల్లాలో గతంలో పలువురు జిల్లా పంచాయతీ అధికారులుగా పనిచేసి వెళ్లారు. ఈ విధంగా ప్రతి పనికి ఇంత మొత్తం ఇవ్వాలని టార్గెట్ పెట్టిన వాళ్లు లేరు. ఈ వ్యవహారమై విజిలెన్స్ దర్యాప్తు చేయిస్తే ఇంకా ఎన్నో విషయాలు బయటకు వస్తాయి.

## సిటీ ఫైనాన్స్

2వ పేజీ కొరవ

మద్రాసు నుంచి వచ్చిన పోలీసులు మేనేజింగ్ పార్టనర్ గాదంశెట్టి గోపాల్ ఆచూకీ కోసం, వై.టి.నాయుడును కలిశారు. సిటీఫైనాన్స్ వ్యవహారాలను చర్చించారు. గాదంశెట్టి హైదరాబాద్‌లో ఉన్నాడని వై.టి. పోలీసులను తీసుకెళ్లిన సమయంలో అప్పటి వరకు చిదంబరం హోటల్‌లో ఉంపుడు గత్తెతో సరసాల సాగరంలో మునిగి తేలుతున్న గాదంశెట్టి నెల్లూరు నుంచి ఫోన్ రావడంతో తుర్రుమన్నాడు. చిదంబరం మాత్రం చిక్కాడు. పోలీస్ దెబ్బకు 10లక్షలు కక్కాడు. ఆ సంస్థ వ్యవహారాలలో క్లీన్ చిట్ ఉన్న వై.టి.ని మాత్రం మద్రాసు పోలీసులు ప్రశ్నించలేదట. అయితే నెల్లూరులో మాత్రం వై.టి. అరెస్ట్ అయ్యాడని తెలుగుయువత మాజీనేత వై.వి. రామిరెడ్డి పుకారు లేవదీసి పత్రికల్లో కూడా రాయించాడు. నెల్లూరు నియోజకవర్గం తెలుగుదేశం ఇన్‌ఛార్జి పదవికి వై.టి., ఖాజావలి పేరును సిఫార్సు చేశాడన్న కసితోనే వై.వి.రామిరెడ్డి ఈ పుకారు లేవదీశారు. వై.వి.రామిరెడ్డి కూడా సిటీ ఫైనాన్స్‌కు అసలు, వడ్డీ కలిపి 4లక్షల 74వేల రూపాయలు బాకీ వున్నాడు. ఇంత వరకు పైసా కట్టలేదు. పాపం ఆ సంగతి మర్చిపోయాడో, లేకపోతే అధికార పార్టీ నాయకుడిని కదా, తననెవరు బాకీ అడగతారనుకున్నాడో తెలియదు. రామిరెడ్డే కాదు. ఇలాంటి వారు ఎవరైనా, తాము తీసుకున్నది సిటీఫైనాన్స్ డబ్బు కాదని, ప్రజల డబ్బు అని గుర్తుంచుకుంటే మంచిది. ఇలాంటి మొండి బాకీదారుల వల్ల, మోసగాళ్లయిన పార్టనర్ల వల్లనే ఫైనాన్స్ సంస్థలు ప్రజలను ముంచేస్తున్నాయి.

## సినిమా

9వ పేజీ కొరవ

ఎస్టాబ్లిష్‌మెంట్‌కి ఇరవై లక్షలు పోయినా ఎనభై లక్షలు మిగుల్తాయి. ఈ జన్మకిది చాలు"!

తన పట్ల అంతటి అపారమైన గురి వున్న ఆ నిర్మాతకు తప్పకుండా కాల్‌షీట్స్ ఇస్తున్నారు మెగాస్టార్ చిరంజీవి.

అయితే శ్రీహరి సక్సెస్‌ని క్యాష్ చేసుకోవడానికి పెద్ద పెద్ద బ్యానర్స్ పెద్ద పెద్ద ఆఫర్స్ ఇచ్చినా చిన్న నిర్మాతలకే ప్రాధాన్యత ఇచ్చి చేస్తున్నాడు. దీనివల్ల చిన్న నిర్మాతలు పరిశ్రమలో నిలదొక్కుకోగలగడానికి అవకాశం ఏర్పడింది. అయితే, శ్రీహరితో సినిమాతీసి నాలుగు రాళ్లు సంపాదించుకున్న నిర్మాతలు - దేవివరప్రసాద్ వలె వేచి చూడకుండా వెంటనే మరో హీరోతో మరో చిత్రం చేస్తున్నారు. ఉదాహరణకు బెల్లంకొండ సురేష్. ప్రొడక్షన్ మేనేజర్‌గా చిత్ర నిర్మాణ రంగంలో అనుభవం గడించిన సురేష్ "సాంబయ్య" చిత్రంతో హీరో అయ్యారు. ఆ చిత్రంతో లాభాలు గడించారు. వెంటనే దాదాపుగా 30లక్షలు ఇచ్చి "మా అన్నయ్య" చిత్రం తెలుగు రీమేక్ రైట్స్ కొన్నారు. భారీగా నిర్మించిన ఈ చిత్రనిర్మాణంలోనే "రా" చిత్రాన్ని ప్రారంభించారు. తదుపరి బాలకృష్ణ హీరోగా మరో చిత్రాన్ని ప్రారంభించడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ మూడు చిత్రాలలోను శ్రీహరి హీరోకాదు. ఈ రోజున వున్న మార్కెట్ రేపు వుండకపోవచ్చు. ఆ రోజున హీరోగా నిలబెట్టడానికి శ్రీహరికి పర్మినెంట్ బ్యానర్స్ - ఏవి? ఎన్ని?

నెల్లూరువాడు, డిజిపి సిహెచ్. ఆంజనేయరెడ్డి కుమారుడు కార్తికేయ, రాధికల వివాహం డిశంబర్ 3 తేది సికింద్రాబాద్‌లోని జ్యూవెల్ గార్డెన్స్‌లో వైభవంగా జరిగింది. ఫోటోలో కొత్త దంపతులతో ఆంజనేయరెడ్డి దంపతులు.

## జిల్లావార్తలు

5వ పేజీ తరువాయి

సంస్థ ఛైర్మన్ నూనెవెంగయ్య ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### గూడూరులో పోస్టల్ ఉద్యోగుల ర్యాలీ

తపాలా వుద్యోగులు మంగళవారం గూడూరులో ర్యాలీ నిర్వహించారు. ర్యాలీనుద్దేశించి ఆలిండియా పోస్టుమెన్ యూనియన్ అధ్యక్షుడు షేక్ హుమయూన్ మాట్లాడుతూ వారానికిపైగా 6లక్షల మంది వుద్యోగులు నిరవధిక సమ్మె చేస్తున్నా ప్రభుత్వం పట్టించుకోక పోవ డాన్ని తప్పుపట్టారు. తమ సమస్యలు పరిష్కరించే వరకు సమ్మె కొనసాగుతుం దన్నారు. ర్యాలీకి పోస్టల్ వుద్యోగుల సంఘం నాయకులు పి.విశ్వనాథం, షేక్ రహంతుల్లా, పాండు రంగారావు, మునిరత్నం నాయకత్వం వహించారు.

### ఇంజనీర్ల సంఘం కార్యదర్శిగా రియాజ్

గూడూరు పంచాయతీరాజ్ శాఖలో అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేసే షేక్ రియాజ్ అహ్మద్, రాష్ట్ర పంచాయతీరాజ్ డిప్లొమా ఇంజనీర్ల సంఘం ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఈ ఎన్నికలు ఆదివారం కర్నూల్‌లో జరిగాయి. రియాజ్ అహ్మద్ గూడూరు లయన్స్ క్లబ్‌లో ఉత్సాహవంతుడైన సభ్యునిగా పేరుగాం చారు.

### గూడూరు రూపురేఖలు మార్చేస్తా!

గూడూరు మునిసిపల్ కమీషనర్‌గా అజయకిషోర్ సోమవారం పదవీ బాధ్యతలు స్వీకరించారు. ఈ సంద ర్భంగా విలేఖరులతో మాట్లాడుతూ ఆర్థిక సంక్షోభంలో వున్న మునిసిపాలిటీ ఆదా యవనరులు పెంచి పట్టణాభివృద్ధికి కృషి చేస్తాను. మునిసిపాలిటీలో పన్నులన్నీ సక్రమంగా వసూలు చేసి ప్రజాసమస్యలు పరిష్కరిస్తానని, అక్రమ కొళాయిల కనెక్షన్లు క్రమబద్ధీకరణ చేస్తానన్నారు.



## భయమెందుకు

మొదటి పేజీ తరువాయి

చేస్తుంటే, మన ప్రభుత్వం 616 రూపాయలు చెల్లిస్తున్నది. క్లాసిక్ విస్కీ ధర ఒక పెట్టె తమిళనాడులో 352 అయితే, మన దగ్గర 826 రూపాయలు. బాగ్‌పైపర్ విస్కీ ధర అక్కడ 351, ఇక్కడ 628. తతిమా బ్రాండ్ల ధరలు కూడా ఇదే ప్రకారం వున్నాయి. తమిళనాడు మనకు ఎంతో దూరంలో లేదు. అక్కడికి ఇక్కడికి ధరలలో ఇంత వ్యత్యాసం ఎందువల్ల అనే ప్రశ్నకు ప్రభుత్వం సమాధానం చెప్పడం లేదు. రాజశేఖరరెడ్డి ఆరోపణ వచ్చిన తర్వాత, తెలుగుదేశం మంత్రులు సమాధానం చెప్తూ రాష్ట్ర ప్రభుత్వం మద్యం ధరలలో పారదర్శకంగా వ్యవహరిస్తుందని, ఇందులో అవినీతి అనేది లేదని ప్రకటిం చారు. అవినీతి లేకుంటే తమిళనాడులో 300 ధరకు ఇస్తుంటే, ఇక్కడ 800 ఎందుకు ఇస్తున్నారో మాత్రం వివరిం చలేదు. ప్రభుత్వం అవినీతికి పాల్పడడం లేదు కాబట్టి దీనిపై విచారణ అవసరం లేదని చెప్పారు మంత్రులు. అవినీతి వుంది, లేదు అన్నది నిర్ణయించవల్సింది మంత్రులు కాదు. అవినీతిలో భాగ స్వాములైన వారు తాము లంచాలు తింటున్నామని చెప్తారా? అది తేల్చ వల్సింది ప్రజలు. ప్రజలు దీనిపై ఒక అభిప్రాయం ఏర్పర్చుకోవాలంటే, వారికి వివరాలు, నిజాలు తెలియాలి. అవి తెలియడానికి ఒకే ఒక్క మార్గం దర్యాప్తు.

రాష్ట్ర ప్రభుత్వం, ముఖ్యమంత్రి అవినీతికి పాల్పడకుండా వుంటే దీనిపై విచారణకు నిరాకరించవల్సిన అవసరం లేదు. విచారణ జరిగితే తమ దోషం బయట పడుతుంది అన్న భయం కల్గినప్పుడు మాత్రమే విచారణ వద్దనడం మన రాజకీయ వాదులకు అలవాటు. చంద్రబాబు సైతం అదే తప్పుడు దారి తొక్కుతున్నారు.

అంత తేలికగా తప్పించుకోదగిన అవినీతి కాదు ఇది. ఈ అవినీతి వల్ల ప్రభుత్వం ఏడాదికి 400 కోట్ల రూపాయ లకు పైగా నష్ట పోతున్నది. జీతాలకు, చిల్లర ఖర్చులకు కూడా ఖజానా ఖాళీ అయ్యి దివాలా తీసిన ప్రభుత్వం, ఇన్ని కోట్ల రూపాయలు మద్యం కంపెనీలకు చెల్లించడం ఏమిటి? ప్రజల ధనాన్ని ఇంత పచ్చిగా దోచిపెట్టడానికి అధి కారులకు సాహసం ఎట్లా వచ్చింది? ముఖ్యమంత్రి స్థాయిలో భాగాల పంపకం జరపకుండా ఇన్ని కోట్లు దిగమ్రింగే ధైర్యం అధికారులకు వుంటుంది అని భావించలేము. చంద్రబాబుపై గతంలో చాలా సార్లు చాలా ఆరోపణలు వచ్చా యి. కాని వాటి దేటికి ఆయన విచా రణకు సమ్మతించలేదు. ఇది వాటన్ని టికంటె తీవ్రమైంది. దీని విషయంలో కూడా దర్యాప్తుకు నిరాకరించి తప్పిం చుకుంటె ఆయన్ను ప్రజలు క్షమించారు. తాను ఏ తప్పు చేయనప్పుడు విచా రణకు భయపడవల్సిన అవసరం ఏమి వుంది?

రాష్ట్ర ప్రభుత్వంలో ఇటువంటి దోపిడీలు ఇంకెన్ని జరుగుతున్నాయో ఎవరికి తెల్సు?



నెల్లూరు అలంకార్ పెంచలయ్య మేనల్లుడు, రైల్వే ఉద్యోగి దండిగుంట జనార్దన్, మాధవి వివాహం 6 తేది నెల్లూరు ఎన్జీఓ హోమ్‌లో జరిగింది.

## శ్రద్ధాంజలి



ఇందుపూరు రమణారెడ్డి గారు

నిరాడంబరుడు, నిష్కళంకుడు, నిష్కపటి,
నిర్మలమైన మనస్సుకు తగ్గ ధవళ వస్త్రధారి,
కర్షకుడై మా అభివృద్ధికి పాటుబడిన

# ఇందుపూరు రమణారెడ్డి గారు

11 తేది సోమవారం శివసాయుజ్యం చెందారు.

వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ వారి ఉత్తరక్రియలు

**21.12.2000 తేది బేస్తవారం**

స్వగ్రామం పోట్లపూడిలో మా స్వగృహమున జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

| కుమారులు | - | కోడళ్ళు |
|---|---|---|
| రామకృష్ణారెడ్డి | - | సీతారామమ్మ |
| మోహన్ రెడ్డి | - | శోభ |
| | - | లత |
| కుమార్తె | - | అల్లుడు |
| శకుంతల | - | అత్తివరపు రమణారెడ్డి |

మనుమలు, మనుమరాళ్ళు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 0861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.